# వచనగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భారతరమణీమణులు, 1 భాగము | ... | 1 | 4 |
| డిటో 2 భాగము | ... | 0 | 10 |
| డిటో 3 భాగము | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, శ్రీ చిన్నయసూరి, | ... | 0 | 12 |
| ,, టీకతో | ... | 1 | 4 |
| పంచతంత్రము, వచనము | ... | 0 | 12 |
| సంగ్రహాంధ్రరామాయణము | ... | 1 | 8 |
| పతివ్రతాచరిత్రలు | ... | 3 | 0 |
| భోజానికథలు | ... | 1 | 0 |
| భోజకాళిదాసకథలు, I-భాగము | ... | 1 | 0 |
| II-భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 8 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు 1,2 భాగములు చ. సీతారామశాస్త్రి ,, | ... | 2 | 0 |
| ,, 3 భాగము బులుసు వేంకటరమణయ్యగారిది | ... | 2 | 0 |
| రాజశేఖరుడు, గోపాలుడు | ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | ... | 1 | 0 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 12 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | [illegible] |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | [illegible] |
| ఋషుల చరిత్ర | ... | 0 | [illegible] |

శ్రీరస్తు

పండిత

# మదనమోహనమాళ్వ్యా జీవితము.



చెన్నపురి

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము

ప ం డి త

# మదనమోహనమాళవ్యా జీవితము.

ఇతనిపూర్వులు మాళవదేశవాసులు. అయితే ఏదో కారణమున వారు ప్రయాగకు వచ్చి అక్కడ స్థిరపడిపోయిరి. మదనమోహనుని పూర్వులు కేవల బ్రాహ్మణులే గాక గొప్ప పండితులై విఖ్యాతి నార్జించిరి. మదనమోహనుని పితామహుఁ డగు ప్రేమధరమాళవ్యా పండితబిరుదాంకితుఁడై అపార సంస్కృతపాండిత్యమువలన ప్రయాగయం దద్వితీయుఁడై అనంతయశస్సు నార్జించెను. తండ్రి యగు వ్రజనాథమాళవ్యా సైతము పండితబిరుదభూషితుఁడే. ఆతఁడు కేవలము సంస్కృతమునందేగాక హిందీలో సైతము అపారపాండిత్యముతో శోభిల్లెను. ఆతఁడు భాగవతము మున్నగు ఉద్గ్రంథముల యందలి క్లిష్టశ్లోకములకు సరళాన్వయము చెప్పి అందఱ నాశ్చర్యపడఁ జేయుచుండెను.

మదనమోహనుఁడు అట్టి పండితవంశమునఁ బుట్టుటయేగాక తాను గూడ విద్వాంసుఁడై ప్రకాశించుచుండుట ఇప్పుడు భారతదేశమున చంటిపిల్ల

లకుఁగూడఁ దెలిసిన సంగతియే. మదనమోహనుఁడు క్రీస్తుశకము ౧౮౬౧. వ సంవత్సరము డిసెంబరు ౧౬-వ తేదీని జన్మించెను.

యుక్త సమయమున మదనమోహనునకు అక్షరాభ్యాసము గావింపఁబడెను. మొదటినుండియు నీతనికి ఇంగ్లీషే బోధింపఁబడలేదు. ప్రారంభమున హిందీయు, సంస్కృతమును చక్కఁగ నేర్చిన తరువాత ఇంగ్లీషు ప్రారంభింపఁబడెను. మాతృభాషా పరిజ్ఞానము గలవారికి పరభాషలు చాల సులభము లగును; గావున నీతఁడు అచిరకాలమునందే మిట్రిక్యులేషన్ పరీక్షలో విజయము బడసి పిదప మూర్ సెంట్రల్ కాలేజీలో ప్రవేశించి ౧౮౮౪-వ సంవత్సరమున అనగా తన ఇరువదిరెండవయేట బి. యే. పరీక్షలో నెగ్గెను. జిల్లాపాఠశాలయందును, మూర్ కలాశాలయందును ఈతఁడు విద్య నభ్యసించు నప్పుడు అపారమేధాశక్తి ప్రదర్శించి గురువులను గూడ ఆశ్చర్యపడఁజేయుచుండెడివాఁడు.

బి. యే. పరీక్షలో నెగ్గునప్పటికి మదనమోహనునకు సంసారమున కొంచెము ఇబ్బంది కలిగెను. అగుటచే నాతఁడు ధనసంపాదనము చేయవలసి తాను మొదట చదివిన జిల్లాపాఠశాలలో నుపాధ్యాయుఁడుగా ప్రవేశించెను. అయితే ప్రవేశించిన

కొలఁదిదినములకే విద్యార్థుల కందఱకును భక్తి భాజన మయ్యెను.

ఆతఁడు ఈయుద్యోగమున రెండేండ్లు పని చేసెను. ఇంతలో దేశము సకలవిధములను క్రుంగి యుండుట గుర్తించి కొందఱు విద్వాంసులు ఉన్నతి మార్గమును సాధింపఁబూనిరి. ఇందులకు అఖిల భారతదేశీయమహాసభ యవసర మయ్యెను. దీనికి మూలకారకులలో ముఖ్యుఁడు దాదాభాయి నౌరోజీ యను పార్శీప్రముఖుఁడు. మదనమోహనుఁడు పాఠశాలలో నుపాధ్యాయుఁడుగా ప్రవేశించిన సంవత్సరమున దేశీయమహాజనసభ ప్రథమమున బొంబయిలో సమావేశ మయ్యెను. రెండవసంవత్సరము కలకత్తాలో కూడెను.

ఈవార్తయు, దాని ప్రవృత్తియు మదనమోహనునకుఁ దెలియవచ్చెను. స్వధర్మదీక్ష గల పండిత వంశమున నుద్భవించినందుల నాతఁడు స్వాయముగ నెల్లపుడును దేశము నున్నతికిఁ దెచ్చు చింత యందే మునింగియుండెను. అట్టివాఁడు దేశీయమహాసభ కలకత్తాలో కూడ నున్న దని తెలిసినప్పుడు ప్రయాగయందలి జిల్లాపాఠశాలలో ఎట్లు కూర్చుండఁగలఁడు? వెంటనే యాతఁడు దేశీయమహాసభలో చేరి దేశారాధనమునకు కంకణము దాల్చెను.

అప్పుడు అయోధ్యమండలాధిపతులగు రాజా రామపాలసింగుగారు దేశీయులకు జ్ఞానభిక్షనొసంగుటకు "హిందూస్థానీ" యను పేరుతో నొక దినపత్రికను ప్రకటించుచుండిరి. దానివలన ప్రజలు చాల లాభమును పొందుచు రామపాలసింగుగారిని వినుతింపఁదొడఁగిరి. ఇట్లుండఁగా సింగుగారికి మదనమోహనుని శక్తిసామర్థ్యమును, దేశమునెడల గల భక్తిశ్రద్ధలును దెలియవచ్చెను.తోడనే పత్రికా సంపాదకత్వము నాతనిమీఁద నుంచిన పత్రిక సకలవిధములను అభివృద్ధిఁ గాంచు నని గూడ తోఁచుటయు కబురుపంపి "ఈభారమును వహింపవలసిన" దని కోరుటయు జరిగెను. మదనమోహనుఁడు అత్యానందముతో హిందూస్థానీపత్రికా సంపాదకత్వమును వహించెను.

బంగారమునకు పరిమళమును, పరిమళమునకు స్వర్ణత్వమును అబ్బినట్లయ్యెను. మదనమోహనునివలన పత్రికకు ఆదరము హెచ్చెను. పత్రిక వలన మదనమోహనుని ప్రతిభ వికసించెను. ఈ రెంటివలనను రామపాలసింగుగారి వాంఛ నెఱవేఱెను.

ఇట్లు రెండు సంవత్సరములు గడచిన తరువాత మిత్త్రులు న్యాయవాదవృత్తి నవలంబించుట

కును మున్ముందు ధర్మశాస్త్రము నభ్యసించుటకును ప్రోత్సహింపఁజొచ్చిరి. క్రమక్రమముగ నాతనికి ఆప్రోత్సాహము చాల ఉపయోగకరముగ కాన్పించెను. ఈసంగతులు అన్నియు రామపాలసింగు గారికి తెలియఁగా వారుగూడ నందులకు త్వర పెట్టిరి. తోడనే మదనమోహనుఁడు లాకాలేజీలో ప్రవేశించి ౧౮౯౧-వ సంవత్సరమున యల్,యల్, బి. పరీక్షలో కృతార్థుఁడై ప్రయాగయందలి హైకోర్టులో న్యాయవాదిగా పని ప్రారంభించెను.

కుశాగ్రబుద్ధికి ఎందు ప్రవేశించినను విజయమే, మదనమోహనుఁడు అచిరకాలమునందే ప్రయాగ హైకోర్టునందలి న్యాయవాదులయం దగ్రగణ్యుఁ డయ్యెను. ఈక్రొత్తవృత్తిలో నాతనికి పుష్కలముగ ధనము లభించెను. ధనికుఁ డని ప్రఖ్యాతి వచ్చెను. అన్నిటికిని ముఖ్యమైన ప్రయోజన మేమనఁగా ? తన భావములను సమగ్రముగను, మనోరంజకముగను పెద్దపెద్ద సభలలో స్పష్టముగఁ జెప్పి అందఱి నాకర్షింపఁగల యుపన్యాసధోరణి సునిశిత మయ్యెను. మదనమోహనుఁడు ఇప్పుడు ఒఱదీసిన కత్తివలె నుండెను.

ఈకాలమున ప్రయాగలో పండిత అయోధ్యానాథుఁడును, పండిత విశ్వంభరనాథుఁడును, వైదు

ష్యమునందును దేశభక్తియందును అసామాన్యులై వెలుంగుచుండిరి. వారి కీతఁడు తోడయ్యెను. ఈ ముప్పురును కలిసిరి. వీరి కలయిక త్రేతాగ్నుల సమావేశమువలె నుండెను. ఈముప్పురును గలిసి సంగతులన్నియు యోచించిరి. ప్రథమమున వారి దృష్టి సంఘముమీఁదికిఁ బ్రసరించెను. వారికే గాదు సమ్యగ్దృష్టిగల యెల్లరును మొదట చేయఁబూనునది సంఘప్రసాధనమే.

ఇటీవల నొక పండితుఁడు రాజకీయ స్వాతంత్ర్యము లేనిదే సంఘమును బాగు చేయుట కవకాశము లేదని చెప్పెను. అనగా శాసన బలమువలనగాని తప్పుత్రోవలలో మెలఁగుచున్న ప్రజలను మంచిమార్గమునకుఁ దెచ్చుటకైతి గాదని యాతని యభిప్రాయము. ఇది చక్కఁగనే కాన్పింపవచ్చును; గాని సంఘాచారములయందు బహుముఖములఁ జీలియున్న ప్రజలు ఐకమత్యముగ నున్నగదా రాజకీయముగ స్వాతంత్ర్య మబ్బుట. ప్రప్రథమమున వీరిని రాజకీయస్వాతంత్ర్యము నిమిత్తము ఏకముఖమునకుఁ దెచ్చుట యెవనికి సాధ్యపడును ? బహుముఖముల నుండుటవలని నష్టములను బోధించి చూపి ఐకమత్యమువలని

ప్రయోజనములను చారిత్రికముగను ప్రత్యక్షము గను ఎఱింగించి నచ్చఁజేసి సాంఘికముగ కొంత పఱకు ఏకపలయమునకుఁ గొనివచ్చినఁగాని ప్రజలకు ఐకకంఠ్యము అలవడదు. అప్పుడు గాని రాజకీయ ముగ స్వాతంత్ర్య మలవడదు. రాజకీయముగ స్వాతంత్ర్య మలవడిన తరువాత శాసనబలమున గూడ తొలగింపవలసిన దురాచారములు చెడి పోయిన ప్రతిసంఘమున నుండును. రాజకీయస్వా తంత్ర్య మప్పుడు చేయును.

ఈయుద్దేశముతో ఈముగ్గురుపండితులు హిం దూసమాజము అను పేరుతో నొక సంస్థను నెల కొల్పి చాల పనిచేసిరి. మదనమోహానునకు ఇప్ప టికిఁగూడ ఈయుద్దేశమే గలదు.

ప్రయాగ కాశీరామేశ్వరములవంటి యాత్రా స్థల మనుట ప్రతిహిందువునకు నెఱుకయే. అద్దెల రూపముననో, దానధర్మములరూపముననో, క్రయ విక్రయములరూపముననో ప్రయాగయందలి జను లందఱును యాత్రాపరులనుండి ధనమును సంపా దించుటకే ప్రయత్నించుచుండెను. మదనమోహా నుఁడు అట్లుగాక ప్రయాగలో యాత్రికు లనుభ వించు కష్టనిష్ఠురములను లెస్సగ గుర్తించి నగరీయ సంఘమునఁ జేరి పట్టణము ననేకవిధముల బాగు

చేసి యాత్రికుల యాశీర్వచనము లేగాక పురవాసుల అభినందనములనుగూడఁ బడసెను.

ఈతీరున ప్రజానురాగమును గడించిన మదనమోహనుఁడు తరువాత వచ్చి శాసనసభ యెన్నికలలో ప్రజలచే తమ ప్రతినిధిగా నెన్నుకొనఁబడెను. శాసనసభలో నీతఁడు సకలవిషయముల యందును ప్రజలపక్షమున నిష్కపటముగ వాదించుటచే మరల ౧౯౦౯-వ సంవత్సరమున ఎన్నికలు వచ్చినపుడుగూడ ప్రజలు ఈతనినే తమ ప్రతినిధిగా నెన్నుకొనిరి.

మదనమోహనుఁడు కేవలదేశభక్తుఁడే గాదనియు దేశమునకు సంబంధించిన విషయములలో ఉన్నదున్నట్లు ఖండితముగఁ జెప్పువాఁడు అనియు నిదివఱకే చెప్పఁబడినది. అందుల కీక్రింది యుపన్యాసభాగము (౧౯౧౩-వ సంవత్సరపు జాతీయ సభ) ఉదాహరణము.

“(హిందూదేశము బీదదేశము కాదని చెప్పు) వారు కొంచ మిక్కడికి దయచేసి కన్నులార చూచెదరా? నిజముగ భగవంతుఁ డొకఁ డున్నాఁడనియు, తాము చేసిన కార్యముల కెల్ల నాభగవంతుని యెదుట తాము సమాధానము చెప్పవలసియుండుననియు, వారు నిజముగ నమ్మునెడల వారిదేశమున

కొక్కమాఱు పయనించేసి గ్రామగ్రామమునకుంబోయి ప్రజ లంద ఱెట్టి దౌర్భాగ్యస్థితిలో నున్నారో చూచిన బాగుండును. ౧౮౫౭-వ సంవత్సరపు సిపాయీతిరుగుబాటునకు పూర్వము దేశమేస్థితిలో నున్నదో ప్రజలనడిగి చూచినట్లయిన బాగుండును. ఆవస్త్రములను నేయు సాలీలు నేఁడేమయిరి? అసంఖ్యాకము లగు చేతిపనులు, పరిశ్రమలు, మొదలగు వివిధవృత్తులవలన జీవించు ఆనాఁటి ప్రజలు నేఁడే మయిరి? ప్రతిసంవత్సరమును ఇంగ్లాండు మొదలగు పాశ్చాత్యదేశముల కెగుమతి కాఁబడు అపార మగు ఆనాఁటి వివిధవస్తుసామగ్రి నేఁడేది? ఇవన్నియు నేఁడు స్వప్నసంపద లైనవి. ఇవన్నియు నెప్పటిమాటలో నైనవి ఇప్పుడిక్కడ కూర్చున్న ప్రతివారును సీమనుండి తయారై వచ్చిన వస్త్రములనే ధరించి కూర్చుండియున్నారు. మన మెక్కడికిఁ బోయినను సీమవస్తువులే ప్రత్యక్ష మగుచున్నవి. ఇఁక ప్రజలకు మిగిలినది యేమి? ఏభూమి దున్నుకొనియో కొద్దిగింజలను పండించుకొని ఏదో విధముగ ఘటయాత్ర సలుపుటయే మన ప్రజలకు శరణ్య మైనది. చివరకు మనకు మిగిలినది యిది. లేదా? పోగా మిగిలిన కొద్దిపాటి వస్త్రకముతో వచ్చీరాని లాభములతో కాలక్షేపము చేయ

వలసివచ్చుచున్నది. దొరతనమువారి సేవకుఁ బోయి నను వర్తకము చేసికొనఁబోయినను దేనికిఁ బోయి నను ౫౦ ఏండ్లకు పూర్వము మనవారు పొందు చుండిన లాభములలో సౌఖ్యములలో నూరవవంత యినను మన మిప్పుడు పొందుట లేదు. ఈస్థితిలో దేశము సౌఖ్యముగ నుండు మనిన నెట్లుండఁగలదు? ఇంతకంటె బీదస్థితి మన కింకకాదు. దీనిలో నా శ్చర్య మేమియు లేదు”

మదనమోహనుని అకృత్రిమబుద్ధికి మఱియొక యుదాహరణము. దేశ మిట్టి దరిద్రస్థితిలో నుం డుటఁ గాంచి పెద్ద లందఱును యోచించుచుండిరి. ౧౯౦౬-వ సంవత్సరమున దేశీయమహాసభ కల కత్తాలో జరిగినపుడు దాదాభాయినౌరోజీ యీ స్థితి మారవలె ననిన స్వరాజ్యము రావలె నని చెప్పెను. ‘స్వరాజ్యము’ అను మాట యేసుము హూర్తమున ఆభారతవృద్ధుని పెదవులనుండి జాఱె నో గాని అచిరకాలమునందే దేశమం దంతటను వ్యాప్తమై పోయెను. ఎక్కడఁజూచినను పెద్దలు అందఱును స్వరాజ్యము కావలె నని చెప్పసాగిరి. అప్పుడు గవర్నరుజనరలుగ నున్న కర్జనుప్రభువు చేసిన యొక అనాలోచితకార్యమువలన ప్రజలలో ఈవాంఛ మఱింత విజృంభించెను. కర్జనుప్రభువు

తీరికూర్చుండి ఒకటిగానున్న బంగాళా దేశమును రెం డుగా చీల్చెను. ఈవిభజనమువలన బంగాళీల యైక మత్యమునకును జాతీయతకును భంగము కలుగును. ఈసంగతి గ్రహించి బంగాళీలు ఆందోళనము ప్రారం భించిరి. ఆంగ్లేయుల తరువాత బంగాళీలుగూడ రాజ్యతంత్రములో చాల నిపుణులు గావున ఒక్క బంగాళా దేశమునకు సంబంధించిన యీవిషయ మును జాతీయవిద్య,స్వరాజ్యము, స్వదేశవస్త్ర స్వీక రణము మున్నగు నంశములతో గుదిగ్రుచ్చి భార తీయుల కందఱకును సంబంధము గలిపిరి. సేతువు మొదలు హిమాలయమువఱకు నొకటే యాందో ళన మయ్యెను. ఈయాందోళనమునుజూచి ఇంగ్లాం డునందలి మంత్రి వర్గముగూడ సంచలించెను.అంతట ఏదోవిధమున ఇది చల్లార్చినగాని అపాయమువచ్చు నని తలంచి వారు హిందూదేశమునకు కొన్ని సదు పాయములను జేయఁదలంచి సూచనలు చేయుటకు అప్పుడు హిందూదేశపుమంత్రిగా నున్న మార్లే ప్రభువునకు కన్నుగీటిరి. మార్లేప్రభువు అప్పుడు ఈ దేశమున గవర్నరుజనరలుగానున్న మింటో ప్రభు వుతో కలిసి కొన్ని యధికారములను సిఫార్సు చేసెను. ఆసిఫార్సువలన అదివఱకులేని క్రొత్తయధి కారములు కొన్ని సంక్రమించుచుండుటచే మన

మదనమోహనుఁడు మార్లే ప్రభువును, మింటో ప్రభువును చాల వినుతించెను; గాని యీసిఫార్సులు పార్లమెంటునడపోతలో నిరర్థకము లగుటచే పిదప మదనమోహనుఁడు దొరతనమువారి ప్రవృత్తిని చాల తీవ్రముగ విమర్శించెను.

౧౯౦౯-వ సంవత్సరమున దేశీయమహాజనసభ పంజాబుదేశమునందలి లాహోరుపురమున జరిగెను. అప్పుడు స్వాగతకారిణీసమితియు, దేశమునందలి దేశీయమహాసభయొక్క శాఖలును మదనమోహనుని సభాధిపతిగా నంగీకరించెను. మదనమోహనుఁడు అప్పుడు ఉజ్జీవకం బగు మహోపన్యాసము గావించి సభాసదుల హృదయములను పల్లవింపఁ జేసి సభను నిర్విఘ్నముగను అద్వితీయముగను కొనసాగించెను.

౧౯౧౦-వ సంవత్సరమున ప్రజలు ఈపండితుని సామ్రాజ్యశాసనసభకు తమప్రతినిధిగా నెన్నుకొనిరి. అందు అప్పటినుండి నేఁటివఱకు నీతఁడు పని చేయుచున్నాఁడు. ఈతఁ డందు ప్రవేశించి చేసిన పను లన్నియు దేశమునకు మహోపకారకములు. అయితే యీతనివాదముమాత్ర మనేక సందర్భములలో నెగ్గలేదు. మన దేశపుశాసనసభలలో ప్రజాప్రతినిధుల మాటల కేమియు ఆధా

రమము లేదు; గావున వారి వాదములు నెగ్గకున్నను అసలు వాదము మంచిదా చెడ్డదా? అని మాత్రమే మనము యోచింపవలసినది ౧౯౧౦-వ సంవత్సరమున ప్రవేశపెట్టఁబడిన ముద్రాలయశాసనము నీతఁడు తీవ్రముగ ఖండించెను. రాజద్రోహసభా శాసనమును పూర్తిగ నిరసించెను. గోక్లేగారి నిర్బంధోచితప్రారంభవిద్యావిషయిక మగు బిల్లును చాల సమర్థతతో బలపఱిచెను. దక్షిణాఫ్రికాలో కూలీలుగా నున్న భారతీయు లనుభవించు కష్టము లన్నియు పూసగ్రుచ్చినట్లువర్ణించి వానిని తొలగింపవలయునని నొక్కి చెప్పెను; గాని ఈతఁడు ఏవిషయమును చేయవలయు నని వాదించెనో వానికెల్ల దొరతనమువారు ప్రతికూలము చేయసాగిరి. అయినను ఈతఁడు విసువక సమయము వచ్చినపు డెల్ల ప్రజాపక్షము నవలంబించి నిర్భయముగ దొరతనముతో పోరుచుండును.

హిందువులకు స్వేచ్ఛకావలె ననిన స్వరాజ్యము కావలెను. బ్రిటిషు ప్రభుత్వముక్రింద మన దేశమువలెనే ఇంకను, కొన్ని దేశములు గలవు; వానికి స్వాతంత్ర్యము గలదు. ఒక్క బావుటాక్రింద నుండు ప్రజలకు ఈభేద మేల? కావున హిందూదేశములనుగూడ తక్కిన దేశములతోఁబాటు చూడ

వలెను. ఈయభిప్రాయముతో బయ్యా నరసింహే శ్వరశర్మగారు మున్నగు ౧౯ గురు సామ్రాజ్య శాసనసభ యందలి ప్రముఖులు ఒకదస్తావేజును తయారుచేసిరి. వీరిలో మన మదనమోహనుఁ డొకడు.

దేశములో స్వారాజ్యమును గూర్చి పెద్దల యందును పిన్నలయందునుగూడ నిట్టి వాంఛ బల ముగ నుండుటచే ఇంగ్లాండులో పార్లమెంటుగూడ కొంచెము కదలిక చూపవలసివచ్చెను. హిందువు లకు ఏదో విధమున కొన్ని స్వాతంత్ర్యము లిచ్చి నఁగాని వ్యవహారము చక్కఁబడదని అధికారపక్షము నకుఁ జెందినవారు అక్కడివారును, ఇక్కడివారును గూడ తలంచిరి. దీనిమీఁద హిందూదేశమంత్రి యగు మాంటాగూ దొరపార్లమెంటులో౧౯౧౭-వ సంవత్సరము ఆగష్టు ౨౦-వ తేదీని హిందూదేశ రాజ్యాంగవ్యవహారము బాగుగా లేదనియు, అది మార్చవలయు ననియు, హిందూదేశమునకు స్వపరి పాలనము నొసంగుట బ్రిటిషు ప్రభుత్వముయొక్క యుద్దేశ మనియుఁ జెప్పెను. అందుల కనుగుణ ముగ నాతఁడు నవంబరులో హిందూదేశమునకు వచ్చి ఇక్కడ గవర్నరుజనరలుగా నున్న ఛల్మస్ ఫర్డుప్రభువుతోఁ గలిసి దేశ మంతయు సంచరించి

అనేకసంఘములనుండి వినతిపత్రములను గైకొని తుద కొక నివేదికను తయారు చేసెను. దానిపేరే మాంటుఫర్డునివేదికము. దీనిని గుఱించి దేశములో భిన్నాభిప్రాయములు చెలరేఁగెను. మదనమోహనుఁడు దీనిని చిక్కఁగా విమర్శించెను. ఆనివేదికమునందలి వివరము లిచ్చుట కిది స్థలము గాదు.

తరువాత దేశమునందలి ప్రముఖులు ఈమాంటుఫర్డు నివేదికమును గుఱించి యోచించుటకు కాంగ్రెసును డిల్లీలో సమావేశపఱిచిరి. దానికి మదనమోహనుఁడే అగ్రాసనాధిపతిగా ఎన్నుకొనఁబడెను. దేశీయుల కీతనియెడఁగల భక్తిశ్రద్ధలకు రెండవమాఱు ఈతనిని దేశీయసభకు అధ్యక్షునిగా ఏర్పఱుచుటయే తార్కాణ. ఆసభలో నీతఁడు భావపూరితము అగు మహోపన్యాసము నిచ్చి సభను నిర్విఘ్నముగను ఘనముగను నెఱవేర్చెను.

హిందూదేశమునందలిపరిశ్రమములను గుఱించి విచారణసలుపుటకు దొరతనము ఒక సంఘమును నియమించెను. మన మదనమోహనుఁ డందొక సభ్యుఁడు. ఈసంఘసభ్యులు దేశ మంతయుఁ దిరిగి విచారణ చేసి ౧౯౧౮-వ సంవత్సరమున నొక నివేదికమును ప్రకటించిరి. మదనమోహనుఁడు అప్పుడు తన హిందుత్వమును చక్కఁగ వెల్లడించెను. తక్కిన

వారందఱును వ్రాసిన నివేదికము హిందూదేశము యొక్క భవిష్యదున్నతికి అనుకూలముగ లేదు. అగుటచే మదనమోహనుఁడు ఆనివేదికము నంగీకరింపక తాను ప్రత్యేకముగ నొకనివేదికమును ప్రకటించెను. మదనమోహనుని నివేదికము సంఘము యొక్క నివేదికకనుబంధముగఁ బ్రకటింపఁబడినది. మదనమోహనుని యౌచిత్యమును దేశ మంతయుఁ గీర్తించిరి.

మదనమోహనుఁడు గొప్పవిద్వాంసుఁడు. జనసామాన్య మంతయు అవిద్యాంధకారమునఁ గూలి యున్నది. కలాశాలలయందును పాఠశాలలయందును చదువుచున్న విద్యార్థులు [illegible] [illegible] ప్రాచీనములకు దూరులయి పోవుచున్నారు. మదనమోహనుని మనస్సు ఈవిషయమును గమనించెను. “స్థితి చక్క జేయవలెను” అని మనసునకుఁ దోఁచెను. ఆతని మిత్రులనేకు లీవిధముగనే తలంచిరి. “హిందూలకు మన సాంప్రదాయముల గొప్పతన విద్యనేర్పు విశ్వవిద్యాలయము నెలకొల్పవలెను. ఇందులకు కాశీనగరము అర్హమైనది” అని వారు తలంచిరి. మదనమోహనుఁడు వెంటనే పని ప్రారంభించెను.

ఇందులకై యాతఁడు ప్రప్రథమమున చేసిన

మహాత్యాగము న్యాయవాదవృత్తిని విసర్జించుట. ఆవృత్తివలన ఇక్కడి మన న్యాయవాదులకువలెనేకాక ఆతనికి అనంతాదాయము వచ్చుచుండెను. దేశహితార్థ మీతనివలె స్వార్థమును విడిచినవారు హిందూదేశమున కొలందిమందియే యున్నారు.

న్యాయవాదమును విడిచి యాతఁడు దేశాటనము ప్రారంభించెను. పట్టణపట్టణములు దిరిగెను. సేతువు మొదలు శీతనగమువఱకుగల ప్రతి పెద్దపట్టణమునందును గొప్ప సభలను గూర్చి స్వదేశ సభలలో నుపన్యసించి కొంగుజాచెను. కొందఱు వేలు ఇచ్చిరి. పదివేలు కొందఱిచ్చిరి. లక్షలు కొలందిమందియే యిచ్చిరి. కావలసిన ధనము సమకూడెను. ప్రజల పని తీఱినది, ఇక దొరతనము పని తరువాయి యుండెను.

అప్పుడు హార్డింజిప్రభువు మనకు గవర్నరు జనరలుగా నుండెను. ఆతఁడు న్యాయమునకు సహాయుఁడు. మదనమోహనుఁడు సహజముగ సంకల్పసిద్ధుఁడు. [illegible] హిందూవిశ్వవిద్యాలయమునకు ఆజ్ఞ వచ్చెను. దానికి శంకుస్థాపనను హార్డింజి ప్రభువే చేసెను.

హిందూదేశమున నభిమానము గల హిందువెవఁడైన మాతృదేశహితార్థము పనిచేయఁబూని

నచో తోలుదోలుత చేయవలసిన పని విద్యార్థులకు జాతీయవిద్య నేర్పుటచుట. ఇన్ని కష్టములుపడి నెలకొల్పిన మదనమోహనుని కృషికి ఫలముగ ఈహిందూవిశ్వవిద్యాలయమునందలి విద్యార్థులను భ్రష్టులను జేయుటకుఁ బ్రయత్నములు జరిగెను; గాని భగవదనుగ్రహమువలనను,సహజముగ మదనమోహనుఁడకృత్రిమప్రాపయుఁ డగుటను అది నెఱవేఱలేదు. మిత్రు లనేకులు హిందూవిశ్వవిద్యాలయము మీఁద నేదో యొకవిధముగ అధికారము వహింపవలసిన దని సలహా చెప్పిరి; గాని యాతఁ డందుల కంగీకరింపక "నేను మీఁద నధికారము వహింపను సేవ చేసెద" నని చెప్పెను.

సహజముగ హిందూదేశములో స్వరాజ్యము నిమిత్తము విశేషముగ నాందోళనము జరుగుచుండెను. అందుల కనుగుణముగ హిందువులు ప్రపంచ సంగ్రామములో ఆంగ్లేయులకు చాల సాహాయ్యముచేసిరి. భారతీయుల సాహాయ్యము లేకున్న యూరపుఖండచరిత్ర మాఱిపోయియే యుండును. ఇన్నిటివలనను యుద్ధానంతరము దొరతనమువారు హిందువులకు రాజకీయస్వతంత్రత నిత్తు రని ప్రజలాశించియుండఁగా అందులకు మాఱుగ రౌలటు చట్టము నిర్మింపఁబడెను. ప్రజలు వల దని ఘోషిం

చిరి. సామ్రాజ్యశాసనసభలో మదనమోహనుఁడు నాలుగైదుఘంటలనర్గళముగ నుపన్యసించి ఇది యన్యాయ మని చెప్పెను. సభ్యు లందఱును వల దనిరి. ఇట్లు దేశము ఆబాలగోపాలము వలదను చున్నను మానక దొరతనమువారు ఈ చట్టమును నిర్మించుటచే ఆత్మగౌరవము గల తాను అక్కడ నుండఁగూడదని తలఁచి మదనమోహనుఁడు తన సభ్యత్వమును వదలుకొనియెను, గాని అచిరకాలమున తటస్థించిన యెన్నికలలో ప్రజలు ఈతనినే మరల ఎన్నుకొనిరి.

ఎప్పుడు ఈశాసనము నిర్మింపఁబడినదో అప్పుడు పంజాబులో అల్లరులు ప్రారంభ మయ్యెను. వాని నడఁచుటకు గాంధి అచ్చటకు బయలుదేఱెను; గాని దొరతనమువారు పోనీయలేదు. దీనిమీఁద పంజాబీల యుద్రేకము మఱింత హెచ్చినది. దౌర్జన్యములు ప్రారంభ మైనవి. దొరతనమువారు శాంతిని స్థాపించుటకు కత్తిదూసిరి; గాని అల్లరులు తగ్గలేదు. చివరకు మార్షలులాను ప్రకటించిరి. పంజాబు అల్లకల్లోల మయ్యెను. దేశ మంతయు అట్లుడికిపోయినట్లు ఉడికిపోయినది. పంజాబీలకు చాల బాధలు గలిగెను. వీని నన్నిటిని వివరించుట కిక్కడ చోటు లేదు. వీనికి సంబంధించిన ప్రతి విషయమునందును

మదనమోహనుఁడు చాల పని చేసెను. అనేక పర్యాయములు దొరతనముయొక్క అక్రమములను ఘంటాపథముగ విమర్శించెను: గాని ప్రయోజనము కలుగ లేదు.

పిదప మదనమోహనుఁడు పంజాబుదేశమునకు వెళ్లి స్వయముగ విచారణ చేసెను. ఇట్లుండఁగా ఛల్మ్‌ఫర్డు దొరగారు పంజాబులో మార్షలులాను అములుజరిపిన యుద్యోగులకు ఏబాధయు తటస్థింపకుండునట్లు సామ్రాజ్యసభలో ఇండెమ్నిటీబిల్లుఅను పేరున నొక అభయహస్తపు శాసనమును ప్రవేశపెట్టిరి. ఇది ఆయుద్యోగులమీఁద ప్రజలు నష్టపరిహారములు వగయిరాలనిమిత్తము దావాలు మున్నగునవి చేయుటకు వీలు లేకుండునట్లు ఏర్పఱుపఁబడినది. "పంజాబులో జరిగిన అక్రమములను విచారించుటకు దొరతనమువారే హంటరుకమిటీని ఏర్పఱిచిరి. దాని పర్యవసానము తేలకుండ నిప్పుడు ఈబిల్లు ఎందులకు" అని ప్రజలును, మదనమోహనుఁడును శాసనసభ్యులు అందఱును చాలపట్టు బట్టిరి; గాని ప్రయోజనము కలుగ లేదు. ఇండెమ్నిటీబిల్లు శాసనరూపమును దాల్చెను.

పిదప మదనమోహనుఁడు పంజాబు అక్రమములను గురించి సామ్రాజ్యశాసనసభలో అడు

గుటకు గాను ప్రశ్నలను తయారు చేసిరి; గాని అవు గుట ఉద్యోగులు అంగీకరింపక త్రోసివేసిరి.

పిదప గాంధి లేవనెత్తిన నిరాకరణోద్యమము ముదిరినది. దీనిని గురించి మదనమోహనుఁడు చాల పరితపించెను. ఇది దేశమున నల్లరులను బెంచు నని యాతఁడు వాదించెను. దొరతనమునకును గాంధిపక్షమునకును రాజీచేయుటకు అతఁ డనేక విధములఁ బ్రయత్నించెను; గాని ఉభయపక్షముల వారును బిఱ్ఱబిగిసిరి.

తుదకు మదనమోహనుఁడుగాంధి మార్గమునఁ జిక్కుకొనియెను; పిదప నాతఁడు అందు ఆవేశముతోఁ బనిచేయసాగెను.

బహుశా నతడు దొరతనమునకు గాంధీపక్షమునకు సంధిగావింపజేసిన ప్రయత్నముల భంగములే ఆయనను గాంధీపక్షమున త్రిప్పినవేమో.

వీరిట్లు సంధిగావింపజేసిన ప్రథమ ప్రయత్నము 1921 లోనే సహాకార నిరాకరణోద్యమ కార్యక్రమమంతయు తనకంగీకారముగాకున్నను మాళవ్యా పండితునకు గాంధీ సౌమ్యతను-నూతనోద్యమము నందలి ఉత్తమతత్వమును తెలియకపోలేదు. అప్పుడు క్రొత్తగా వచ్చియుండిన (1921 ఏప్రిలులో) వైసరాయి రీడింగు ప్రభువును సాధుపుంగవుడని విని

యుండెను. కాపున వీరిరువురికి భేటీ యేర్పరచుట భారతదేశమునకు లాభకరమని తలంచి మేనెలలో వీరిరువురికి అట్టి సమావేశము నేర్పరచెను.

ఆ సమావేశమున నొకరినొక రర్థము చేసుకొన యత్నించిరి. ఆలీసోదరుల తీవ్రోపన్యాసములను గాంధీదృష్టికి కొనిరాగనే వారావిషయమును సులభముగనే గ్రహించిరి, వారిచే క్షమార్పణ నిప్పింతుమని పిదప అట్లుగావించిరి. కావున నీసమావేశమున నొకవిధముగా పరస్పరము సుహృద్భావము వేర్పడినది. అది యట్లే పెంపొంది పిదప యువరాజు బహిష్కారసందర్భమున గావించిన ప్రయత్నము సఫలీకృతమైయుండినచో భారతదేశచరిత్ర వేరుగ వ్రాయదగియుండెడిదే.

ఉదారహృదయులగు యువరాజు (ప్రిన్సు ఆఫ్ వేల్సు) 1920 లోనే వచ్చియుండవలసినది. కాని 1921 నవంబరులో భారతదేశమున అడుగిడిరి. కాంగ్రెసువారి బహిష్కారమువలన పలుతావుల ముఖ్యముగ బొంబాయిలో చాల అల్లరులు రేగినవి. ఎంతోమంది వాలంటీర్లు నిర్బంధితులైరి. డిశంబరు 25 తారీఖున ఆయన కలకత్తా పట్నము వచ్చున ట్లేర్పాటాయెను. కీ. శే. చిత్తరంజనదాసుగారి ప్రతిభావిశేషమున బహిష్కారము సంపూర్ణముగ

జరుగుసూచనలు కాన్పించెను. ప్రభుత్వము క్రిమినల్ లా అమెండుమెంటుచట్టమును ప్రకటించి దాని క్రింద శ్రీదాసుగారిని వారిసతీమణిని పుత్రరత్నమును సహా అరెస్టుచేసిరి. వ్యగ్రోత్సాహులగు; బంగాళీ లెంతకైన సంసిద్ధులు. వైస్రాయికి కలకత్తాయందైన శ్రీయువరాజుగారి కాహ్వాన మిప్పింపవలయునని ఆత్రము కల్గెను. శ్రీమాళవ్యాగా రిది గ్రహించిరి. అదనెరిగి పదునుతప్పకుండ పాలకులకు పాలితులకు సంధియొనర్చుట లగ్గని తలంచిరి.

అప్పటప్పటికే నెహ్రూ తండ్రితనయులు లాజపతిరాయి మున్నగు ప్రముఖులందరు ఖైదున కేగియుండిరి. శ్రీమాళవ్యా ప్రభృతులు డిశంబరు 21 వ తేదీనాడు వైస్రాయిని కలుసుకొనిరి. ఆలిపూరు జైలునందున్న చిత్తరంజనుదాసుగారితో టెలిఫోను మీదను, అహమ్మదాబాదునందున్న గాంధీతో తంతి మీదను సంప్రతింపు లారంభమైనవి. శాసనోల్లంఘనపు కైదీలనువదులుటకున్ను మార్చి (1922) 22వ తేదీన సంస్కరణములవిధాన మాలోచింప రౌండు టేబిల్ సభ నేర్పాటుచేయుటకున్నూ, ఆసభకు కాంగ్రెసువారిని 22 రిని ఆహ్వానించుటకున్ను రీడింగుప్రభువుసమ్మతించియుండెను. కాని ప్రభుత్వము

వారు క్రిమినల్‌లా అమెండుమెంటుచట్టపు ఖైదీలనే విడుదల గావింప నంగీకరించిరి.

దానునంగీకరించెనుకాని గాంధీ ఆలీసోదరులు మున్నగు ఖైదీలున్నూ పట్నా ఖైదీలున్ను విడుదల కావలెనని కోరెను. మరియు పికెటింగుహక్కు సమ్మతింపవలెనని కూడా కోరెను.

ప్రభుత్వమువారు కరాచీఖైదీలవిడుదల నొక విధముగా అంగీకరించిరిగాని మిగత రెంటి నంగీకరించ లేదు. ఈస్థితిలో గాంధిజబాబుచేరులోపల రీడింగు సిబ్బంది కలకత్తాపవలుటయు, రాయబారములు భగ్నమగుటయు జరిగెను. ఇప్పుడు వింతగా కన్పించి నను అప్పుడు జరిగిన యొక్క విశేషము నిక్కడ వచింతుము. నేటిపాకీస్థాన్ పైగంబర్ మహ్మదాలీ జిన్నా గారు మాళవ్యాపండితున కీరాయబారముల తోడ్పడియుండెను. కావుననే ఆయన 1934 మే 24 వ తేదీన ఇంగ్లాండు వెళ్ళుచు స్టీమరుపై బొం బాయి రేవులో పత్రికావిలేఖరితో నిట్లనియుండెను:-

"మనము రాష్ట్రీయస్వాతంత్ర్యమునకై పోరా డుచుండుటలేదు. అది నాకెప్పుడును స్పష్టమే. 1921 లోనే మన కది లభించియుండెడిది. రీడింగు ప్రభువు ప్రత్యక్షముగ దాని నిత్తు ననెను; మహాత్మాగాంధీ నిరాకరించినాడు."

కావుననే శ్రీ చిత్తరంజనదాసుగారు దక్షిణాపథమున సంచారమొనర్చుచు న్యాయముగనే గాంధీ "వ్యవహారమును చెడగొట్టెను" అని అధిక్షేపించెను. దానికి నోరాంజన్లను "కృష్ణాపత్రిక" వారు దాసుగారిని "అచ్చుపోసినఆంబోతు" అని ఎద్దేవనగావించిరి. అయితే జైలులో సమాధాన మివ్వజాలకున్న గాంధీని మాళవ్యా సమర్థించి ఆయన పరువు కాపాడినాడు. వెంటనే అహమ్మదాబాదు కాంగ్రెసు సమావేశమై శాసనోల్లంఘన తీర్మానము నంగీకరించెను. బార్డోలీయందు గాంధీ పన్నులనిరాకరణము నడుప నిర్ణయించుకొనెను. దేశమున పరిస్థితులు విషమించుచున్నవని మాళవ్యా పండితుడు గ్రహించినాడు. రణదుంధుభులనినాదములమధ్య శాంతవచనములతో రాయబారపుషరతులను గూర్చి యోచింపగల నేర్పు, శాంతము-ఒక్కపండితునకే గలదు. 1922 జనవరి మధ్యస్థమందు బొంబాయిలో 300 మంది సర్వపక్షములవారిని సమావేశపరచెను. గాంధీయు నాసమావేశమునకు వచ్చినాడు. సర్. శంకర్ నాయర్ అధ్యక్షుడుగానుండి గాంధీ తయారుచేసిన చిత్తుతీర్మానము నచ్చక సభవిడిచి పోగా సర్. మోక్షగుండం విశ్వేశ్వరయ్యగా రధ్యక్షత వహించిరి. రాయబారములు సాగు

చుండగా శాసనోల్లంఘన మారంభింపరాదనియు, రౌండు టేబిల్ సమావేశమునకై ప్రయత్నింప వలయుననియు తీర్మానింపబడెను. ఇచ్చటకూడ నొక వింత జరిగినది. ఈసర్వపక్షసమావేశసభకు కార్యదర్శులు జిన్నా, జయకర్, నటరాజన్ గార్లు. కుపితుడై సభవీడివెళ్లిన సర్. శంకర్ నాయర్ గారు గాంధీ నధిక్షేపించుచు కొన్ని ప్రకటనలు గావింపగా-మిగత కార్యదర్శులతోపాటు జిన్నా గాంధీని సమర్థించినాడట! కాని వైస్రాయి ఈసభవారికోరికలను నిరాకరించెను.

పిదప క్రమముగా బార్డోలిసత్యాగ్రహోపక్రమణప్రయత్నము చౌరీ చౌరాహత్యలు, గాంధీ శాసనోల్లంఘనమును విరమించుట - బార్డోలితీర్మానము-గాంధీ అరెస్టు 6 సం॥శిక్ష జరిగిపోయినవి.

ప్రజాభిప్రాయమును సృష్టించుటకై అవతరించిన కాంగ్రెసుతో రాజకీయ జీవిత మారంభించిదాని అన్ని అవస్థలగాంచుచు ఏ అవస్థయందు దానిని వీడక దానిని సేవించుచువచ్చుచున్న పండితునకు గాంధీ నాయకత్వమున- కాంగ్రెసు సందేశము గ్రామ గ్రామమునకు ప్రాకుటయు, ప్రజాభిప్రాయము విజృంభించుటయు ముదావహమైనది. కాని అట్టి ప్రజాభిప్రాయమును నిర్మాణకార్యక్రమమునకుగాక విధ్వంస

కార్యక్రమమున కుపయుక్తమగుట ఆయనకు కంటకముగ నుండెను. కావుననే ఆయన 1932 మే నెల లోనే వైస్‌రాయి-గాంధీల సమావేశపరచెను. 1921 డిశంబరులో యువరాజ బహిష్కారము తప్పించి రాజకీయసంస్కరణము బడయునుపాయము నరసెను. యావద్భారతదేశమునుయువరాజును బహిష్కరించినను తానుమాత్రము కాశీవిశ్వవిద్యాలయాధినేతగా నతని నాహ్వానించి డాక్టరు బిరుదము నిచ్చిపంపెను. అట్లని కాంగ్రెసును చేయివిడువక- 1922జనవరిలో సర్వ పక్షసమావేశము గావింపించి తిరిగి రాజీప్రయత్నము నొనర్చినను భంగమాయెను. బార్డోలీ పన్నులనిరాకరణమువలన దేశమున ఎట్టి సంక్షోభ ముదయించునో యని తాను జుగుప్స పడుచుండగా దైవికముగాతటస్థించిన చౌరీచౌరా హత్యలవల్ల నది ఆగిపోవుటయేగాక మితిమీరిన ప్రజాశక్తిని నిర్మాణకార్యోన్ముఖ మొనర్చుటకై బార్డోలీలో తీర్మానింపబడుట కతడు హర్షించెను. కాని అట్టి తరి గాంధీని అరెస్టుచేసి ప్రభుత్వము శిక్షించుట నాయన సహింపజాలడాయెను. ఆయన మన సెంతో క్షోభనందెను. ఆచిత్తక్షోభను తెల్పు ఒకటి రెండు ఉపన్యాసముల నానాటి వానిని ఇందుదహరించెదము.

1932 మే నెల మొదటివారమున మాళవ్యా పండితుడు బటాలాలో ఉపన్యసించుచు "మహాత్మునికి శిక్షవేయబడిన పిమ్మట దేశీయులను చాల నిరుత్సాహముకలిగినట్లు కనబడుచుండుటచే చాల చింతగా నున్నది. నాహృదయము నొకడు బల్లెముతో పొడిచినకూడ నాకింతటి చింతకలుగదు." అన్నారు. స్వరాజ్యముకావలెనని త్యాగము లొనర్పుడని వారిని హెచ్చరించెను. "6000 మైళ్ళ దూరముననున్న ఆంగ్లదేశమునుండి భరతఖండమునకు వచ్చిన స్వల్పసంఖ్యాకులగు నాంగ్లేయులు 30 కోట్ల ప్రజలను పరిపాలించుటకు వారికి గల ఆధిక్యత యేమో ఆలోచించుకొనుడని సభ్యుల కోరెను. ఇందులకు నావలెనే మీరును ఈనీచదశకు సిగ్గుపడవలెను" అని కోరెను. యుద్ధమున (1914-18) భారతీయు లాంగ్లేయులకు చేసిన సహాయము నుగ్గడించి అందుకు ప్రతిగా "భారతీయులకు వారు రౌలటుచట్టమును సైనిక శాసనమును జలియన్ వాలాబాగు సంఘసంహారమును ప్రసాదించి" రనియు ఆగాయములనైన మాన్పక వారు "ఉరిసిన పుండున ఉప్పుకారి"రనియు ఉపన్యసించిరి. ఇట్లెంతే నుద్రేకముతో నుపన్యసించి తుదకు నిర్మాణకార్యక్రమము నవలంబింపుడని ప్రజల ప్రబోధించిరి. ఈ

సభ రాత్రి పర్యాప్తమైనది. మాళవ్యాపండితుడు కార్యాంతరములచే ప్రొద్దుపోయి వచ్చిరి. అప్పటికి రాత్రి 10 గంట లైనది. ప్రజ లట్లే వేచియుండిరి. అర్థరాత్రమున సుమారు 1½ గం॥ లసేపు ఉద్రేకపూరితమగు తన యుపన్యాసము నత్యంతధాటితో తన [illegible] వ సం॥ న నీముదుసలి యొసంగెననగా ఆయన మనోత్తీవ్రత తెలియగలదు.

అదే సంవత్సరముననే (19[illegible]) జూలై [illegible] వ తేదీన మథ్రా (శ్రీకృష్ణుని మధురాపట్టణము), యందుపన్యసించినవైఖరి ఇంకను తీవ్రతరముగ నున్నది. హింసాహింసావాదులగు సైనికులకు గల భేదము నిట్లని యాయన అభివర్ణించెను:—

తగవులాడువారు రెండురకములవారు. భ్రాంతి బుద్ధి చేతికిచ్చి పోరాడుమనగానే పోట్లాడువా రొక రకమువారు. అక్కైపుతో ఆ ఆవేశముతో అతడు కత్తికొలది పోట్లాడుచు తనను తాను మరచి ఒకపిచ్చివానివలె పోరాడును. రెండవ రకమువాడు "అల్లాహూ అక్బర్" "వాహెగురూంకీఫత్తే" "జయ్ కాళీ" అను జయధ్వనులతో యుద్ధరంగములకురుకుచువాడు. అతడు ప్రాణబోతుకాడు. తన మతమును గుర్తెరింగినవాడు. దేశసేవచేయుటలో అతడు తనదేహమును మరచినవాడు కాడు. అట్టి యుద్ధభటుల

సోల్జరుల పటాలమే మన కిప్పుడు కావలసియున్నది."

చట్టబద్ధమగు వాతావరణమున తన రాజకీయ ములనేర్చి నడిపిన ఈప్రాచ్య సహాయనిరాకరణశాస నోల్లంఘనముల సమ్మతింపజాలని వినయవినయశాలి ఆనాటిసభలో ప్రభుత్వమువారి అధర్మపుటుత్తర్వుల నుల్లంఘింపుడనిరని క్రిందివిధముగా సోల్జర్లను పోలీసువారిని ప్రబోధించినారు:—

"ప్రభుత్వము ప్రజాసేవకై యుండుననియు మీరును ప్రజాసేవకులనియు గ్రహింపుడు, ప్రభుత్వమువారు నిరపరాధులును, నిస్సహాయులు నగు వారిపై తుపాకులు కాల్చుమని మీ కాజ్ఞ చేసినచో మీరు కాల్చవలదు. పోలీసు వారలారా! మీకును నాసలహా యిది. న్యాయమునకును మతమునకును విరుద్ధముగ నుండెడి ప్రభుత్వపుటుత్తరువుల నెప్పుడును గమనింపవలదు. ఆయుత్తరువులను గమనించుటకు వీలులేదని మీరు వెంటనే నిశ్చయముగ వారితో చెప్పుడు. ప్రజా సేవయే భగవానునిసేవయే యగును."

ప్రభుత్వపుతాబేదారు లిట్లు ఉత్తర్వుల నిరాకరించుట గాంధీ సమ్మతింపడు; వారు రాజీనామాల నివ్వవలయును అని వారి అభిప్రాయము. అన్యాయపు ప్రభుత్వపు టుత్తరువుల నుల్లంఘించు హక్కు

పౌరులకేగాని ప్రభుత్వపు నౌకరులకు లేదని వారి అభిప్రాయము. కాని మాళవ్యాపండితుడు దానికి పై మెట్టెక్కినాడు. మరియొక విశేషము. ఇట్లు చెప్పుట శిష్టాచారము. సర్. సప్రూ ఇండియాప్రభుత్వపు లా మెంబరుగా ఇందుకొక శాసనమును గావించి యుండిరి కాని ఆనాటికి అగ్నిహోత్రుని ముట్టుకొనుటకు ఇండియాప్రభుత్వము జంకుచుండెను. 1930 వరకు ఆయన ఎన్నిమోసాల్గు అవ్యక్తపుమ్యాజిస్ట్రేటు జారీచేసిన 144 సె. ఉత్తర్వుల నుల్లంఘించి యుండెను.

మరియు నీ అభిమానధనుడీసభలో.

"నా దేశమును కొలదిమంది విదేశీయులు పరిపాలన చేయుచుండుటయు దిక్కుతోచక నా దేశీయులాకసమువంక చూచుచుండుటయు నాకు స్ఫురణకువచ్చినప్పుడెల్ల నాకళ్లలోనికి రక్తాశ్రువులు ప్రవహించును."

అని తనహృదయ తాపమును వెలిబుచ్చి

"ఆంగ్లేయులు విదేశీయులు దయాదాక్షిణ్యములకై దోసిలియొగ్గినందువలన మన మాతృదేశమునకు ముక్తి యేమాత్రమును రాదని మీ దేశీయులకు బాగుగ నచ్చచెప్పుడు అని సభాసదులను హెచ్చరించెను.

## 3. పండిత మదనమోహనమాళవ్యా జీవితము.

రాజభక్తిపరులైనశిఖులలో స్వాతంత్ర్యాగ్ని రగులుకొన్నది. ఆత్మగౌరవాభిమానులగువారు తమ మతహక్కులకై పోరాడసాగిరి. వీరులయ్యు వారు గాంధీపద్ధతినవలంబించిరి. ప్రశాంతత్వమునాదును నిష్ప్రతిఘ విధానమవలంబించిరి. పోలీసుల అత్యాచారముల గూర్చి పలుగాథలు దేశమున ప్రచారమాయెను. వెంటనే మాళవ్యాపండితు డచ్చట త్రాలి శ్రీరాజా నరేంద్రనాథ్ గార్ అధ్యక్షత క్రింద నీవిషయముల విచారణసలుపుట కొకవిచారణసంఘ మేర్పాటు గావించెను.

మొదటనుండియు మాళవ్యాపండితుడుసహాయ నిరాకరణమునకు వ్యతిరేకుడని చెప్పియుంటిమి. ముఖ్యముగా శాసనసభల బహిష్కరించుట ఆయనకు నచ్చియుండలేదు. అందుచే శ్రీయుత చిత్తరంజనదాసు, నెహ్రూలు శాసనసభాప్రవేశ వాదము లేవదీసినపుడు ఆయన దాని నాశీర్వదించెను. తానున్నూ 1923 లో ఢిల్లీ శాసనసభ నలంకరించెను. అయితే స్వరాజ్యపక్షమువారి శుష్కప్రతిష్టంభనము వారికి నచ్చలేదు. కేల్కారు, జయకర్, మూంజీ మున్నగువారు ప్రబోధించిన పరస్పరసహాకారవాదము వారికి సమ్మతమాయెను. మంత్రి పదవులస్వీకరించి ప్రజాహితకార్యక్రమము నడుపుచు

ప్రభుత్వముతో పోరాటమునని యే వారి అభీష్టము. అందు కనుగుణ్యముగా వారు కాన్పురపు కాంగ్రెసునందు 1925 డిశంబరు స్వరాజ్యపక్షము వారి తీర్మానమున కీక్రిందిసవరణ నుపపాదించెను:

"సత్వరముగా సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వము ను స్థాపించుటకు వీలౌచ్చుగా అనుకూలించు నట్లుగా- శాసనసభలయందు కార్యక్రమము సాగించ వలెను; అవసరగా జాతీయోద్యమము పెంపొందించు టకు అవసరమైనపుడు సహకారమును, అదే జాతీ యోద్యమములను పెంపొందింప నవసరమైనపుడు ప్రతిఘటనమును అవలంబింప వలయును."

దీనిని నెహూర్రి మున్నగు స్వరాజ్యవాదులు ప్రతిఘటించిరి. సవరణ వోడిపోయెను. తర్వాత మే జయకర్ కేల్కార్ మూంజీలు రాజీనామాల నిచ్చిరి. పిదప ఆసంవత్సరాంతమున క్రొత్తఎన్నికలకు మున్నుగా లాలాజీ రాజీనామా నిచ్చెను. పిదప మాళవ్యాపండితుడు కౌన్సిలుకార్యక్రమమున జయ కరు కేల్కారుల తోటివాడై కాంగ్రెసుతో మాత్రము కలముచెడక వ్యవహరింపసాగెను.

1929 సం. జతీంద్రనాథదాసు అను మహావీరుడు పత్రికేసుకై దీ 64 దినములున్నా లెవ లెంచ్ విజయు పోంగి అసు బంగదేశములో 164 రోజులున్నా,

రాజకీయఖైదీలకు ముఖ్యముగా ఖైదీలకు సామాన్యముగా సౌకర్యము లేర్పడవలయునని ఉపవాస వ్రత మొనర్చి ప్రాణార్పణముల గావించిరి. దానితో అంతవరకు గుజగుజల నడుచుచుండిన నీసమస్య పరిష్కరింప ప్రభుత్వమువారు పూనుకొనిరి. అందుకొకకమిటీని నియమించిరి. ఆకమిటీయందుమాళవ్యా పండితుని చేర్చుకొనిరి. మాళవ్యాపండితుడు రాజకీయఖైదీలకు ప్రత్యేకతరగతి యొకటియుండవలయునని వాదించెను. కాని ఆంగ్లేయాధికారులు దానిని సమ్మతింపజాలరైరి. తాము పేర్కొన్న A. B. C. క్లాసులలోఉత్తమతరగతు లందుటకుపనికివచ్చుననిరి. పండితుడు తుదివరకు పోరాడి ఉత్తమతరగతి లక్షణముల నిర్ణయించుటలోనే రాజకీయఖైదీలు ఇముడునట్లు తంటాలుపడిరి. కాని నాడు పండితుడు కోరినది 3 సం॥ లు పాలించిన కాంగ్రెసుమంత్రులును చేయరైరి, సరికదా - హిందువ్యతిరేకుల పేరుపెట్టి మనమద్రాసురాష్ట్రమున మరికొన్ని నిర్బంధములు హెచ్చుగాకూడ చేసినారట.

దేశమంతయు సైమన్‌బహిష్కరణము సాగించినది. వైస్‌రాయి ఇర్విన్ ప్రభువు ఇంగ్లాండు వెళ్లివచ్చి ఇట్లు ఉద్యోగమధ్యమున వైస్‌రాయి ఇంగ్లాండు వెళ్లి వచ్చుట కిదియే ప్రథమము. 1929 అక్టోబరు

31 వ తేదీన యొకరాజకీయ ప్రకటన గావించెను. అందు సైమన్ కమిషన్ రిపోర్టు అనంతరము జాయంటుపార్లమెంటరీ బోర్డువిచారణ నిర్ణయములకు పూర్వము భారతరాజకీయపక్షముల ప్రతినిధులతో బ్రిటిష్ రాజకీయ వేత్తలు కలిసి రౌండు టేబిలుసమావేశము జరిపించుట న్యాయమును తమ అభిప్రాయముతో చక్రవర్తిప్రభుత్వమువా రంగీకరించుచున్నారని, భారతరాజ్యాంగప్రతిపత్తి డొమినియన్ స్టేటస్ అని తన్ను ప్రకటింపుమనిరనియు, ఆ ప్రకటన మందు వైస్రాయిపలుకరించెను. వెంటనే మాళవ్యా సపూ్రి బిసెంటుగార్లు ఢిల్లీ చేరిరి. కాంగ్రెసునాయకులును చేరిరి. ఆ సమావేశమునకూడిన నాయకులందరును చర్చించి వైస్రాయి ప్రకటనవివరణము తమకు తోచినట్లు వ్యాఖ్యాన మొనర్చుచు తా మామేరకు సహకార మొసప్ప నిచ్చగింతుము అని తెల్పి, కొన్నివిషయముల వాచాకర్షణా బ్రిటిష్ ప్రభుత్వము తమ ఉద్దేశములందు భారతీయులకు నమ్మకము కుదుర్చవలయునని కోరుచు, మరియొక ప్రకటనము గావించిరి. దీనితో పార్లమెంటు ఉభయ సభల తీవ్రమగుచర్చ జరిగెను. ఇట్లుండగ పూర్వము “పయొనీరు” పత్రికాధిపతిగానున్న విల్సన్ త్వరలో ఇర్విన్ ప్రభువు, గాంధీ, నెహ్రూ, మాళవ్యాగార్లను

కలుసుకొనును అని ప్రకటించెను. నిజముగా సర్వ సమావేశము డిశంబరు 23 తేదీన (1929) ఢిల్లీలో జరిగెను. కాని మాళవ్యామాత్ర మందు లేరు. సరి కపా, సప్రూ, జిన్నా, విఠలభాయి, పటేలుగార్లు మాత్ర ముండిరి. కాని రాయబారము విఫలమా యెను. డొమినియన్ స్టేటస్ ప్రసాదింపబడునను నిశ్చ యముతో మిమ్ములను రౌండు టేబిలుసభ కాహ్వా నింపజాలనని వైస్రాయి నిష్కర్షగా చెప్పివేసెను.

నాటి రాజకీయపరిస్థితు లిట్టివి. శాసనసభల కెక్కిన కాంగ్రెసువాదులు మిగతజాతీయవాదుల సాయమున బాధ్యతాయుత ప్రభుత్వము కేంద్రమున కావలయు నని జాతీయవాంఛను కేంద్రశాసనసభయందు స్పష్ట పరచిరి. సైమన్ కమిషన్ విచారణ సల్పించియు, రౌండు టేబిలుసమావేశపు ఆశచూపియు డొమినియన్ స్టేటస్ పేరు చెప్పియు భారతజాతీయవాదులను ఆంగ్లేయ ప్రభువులు బుజ్జగింపయత్నించుచున్నారు. 1921 లో కాంగ్రెసు ఆదర్శము "స్వరాజ్యము" అయినది. ఆ "స్వరాజ్యము" "సంపూర్ణస్వాతంత్ర్యము" అని హాజరత్ మొహానీ 1922 కాంగ్రెసులో తీర్మానము తెచ్చి యోడిపోయెను. "స్వరాజ్య" మనగా "వీలైన బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గతమును లేనిచో వెలిగా స్వాతంత్ర్యము" అని గాంధీ ఉభయవాదుల సమ్మతి

పరుచుచుండెను. కాని సంపూర్ణస్వాతంత్ర్యాదర్శము క్రమముగా కాంగ్రెసువాదులహృదయమున హత్తు కొనజొచ్చెను.1927న మద్రాసునజరిగినకాంగ్రెసులో కాంగ్రెసు ఆదర్శము "సంపూర్ణస్వాతంత్ర్యము" అని నిర్వచింపబడెను. 1928 సం. మధ్యమందు అఖిల పక్షసమావేశమువారు భారతరాజకీయాదర్శము 'డొమినియన్‌స్టేటస్'గా నిర్ణయించిన నెహ్రూకమిటీ రిపోర్టు నంగీకరించిరి. 1928 డిశంబరులో కలకత్తాలో సమావేశమైన కాంగ్రెసుసమావేశమున బహువాద వివాదానంతరము 1929 డిశంబరు 31 వ తేదినాటికి సదరు నెహ్రూరిపోర్టు ననుసరించి భారతరాజ్యాంగ ధర్మము అంగీకరింపబడనిచో భారతరాజకీయాదర్శ మగు సంపూర్ణస్వాతంత్ర్యము సాధింప శాసనోల్లంఘ నాదికముల సాగింపదగును అని తీర్మానింపబడెను. ఈసంవిధానమున 1929 డిశంబరు 31 తేదిలోపల ఆంగ్లభారతదేశముల కేదెనొక్కటి రాజీకానిచో దేశపరిస్థితులు విషమించును. 1922 నాటిపరిస్థితులే తిరిగి ఏర్పడును. శాంతిప్రియుడు, దేశభక్తుడు, స్వాతంత్ర్యవీరుడు మాళవ్యాపండితుడు ఎట్లు చేతులుకట్టుకొని కూర్చునియుండగలడు? అవకాశ ముదయించినంతనే ఢిల్లీకురికి వివిధపక్షనాయకుల సమావేశము, జాయింటుప్రకటన, వైస్‌రాయి గాంధీ

సమావేశము మున్నగు వాటన్నిట అవాంతరము తప్పింప ప్రయత్నించెను. మరియు నొక్క విశేషము; విల్సన్ మాళవ్యాకూడా ఈసమావేశమున పాల్గొనునని వ్రాసియుండెను. కాని వెనుక తనతో కూడ గాంధీగవర్నమెంటుల రాయబారముల కుదుర్ప ప్రయత్నించిన శాంతిదూత జిన్నా నేడు తానొక్కఘనుడై రాయబారమున పాల్గొనకోరగా ఆతని ముందుకుత్రోసి తాను వెనుకతగ్గిన నిర్లిప్తుడు పండితుడు. ఎంతటిస్వార్థత్యాగము!-

లాహోరుకాంగ్రెసునందు కాంగ్రెసువాదులం దరున్నూ శాసనసభలనుండి రాజీనామా నివ్వవల యునని తీర్మానించెనుగాని, మాళవ్యాపండితుడు రాజీనామా నివ్వలేదు. బహుశా ఇందుకు కారణ మాయన కాంగ్రెసుటిక్కట్టుపైగా స్వతంత్రముగానే శాసనసభకు ఎన్నికోబడియుండుట గాయుండును. కాని 'ఇంపీరియల్ ప్రిఫరెన్సు' శాసనసభచే అంగీ కృతముకాగానే రాజీనామా నిచ్చివైచెను; వారితో గూడ వారియనుచరులగు కొందరు జాతీయపక్ష సభ్యులును రాజీనామానిచ్చిరి.

బ్రిటిష్ వారితో మనకు సంబంధమున కారం భము మన వస్త్రపరిశ్రమ వారి అధికారమునకు ఐశ్వర్యమునకు మూలము వారి (లంకాషైరు) వస్త్ర

పరిశ్రమ. ఆపరిశ్రమను, భారతీయమిల్లు పరిశ్రమనుండి జపానువారి పోటీనుండి కాపాడు కొనుటకై చేసిన వివిధ ప్రయత్నములలోని ఇంపీరియల్ ప్రిఫరెన్సు తుదియత్నము. ఇంగ్లాండునుండి వచ్చునదిగాక మరి ఇతర అన్ని దేశములనుండి వచ్చు వస్త్రములపై దరహాముమీాద 100 కి 20 వంతులున్ను ఇంగ్లాండు వానిపై 15 వంతులున్ను దిగుమతిపన్ను వేయవలయునని ప్రభుత్వము వ్రాసెనిరి. దీనిని (భారత) వస్త్రపరిశ్రమరక్షకబిల్లు అనిరి. కాని మాళవ్యాపండితు డిది సమ్మతించలేదు. ఇంగ్లాండునకు (సామ్రాజ్యమునకు) ఈ ఆధిక్యతచూపనవసరము లేదనిరి. వీరు అన్ని దేశములదిగుమతులకు ఒక్కటే రేటుండవలయునని సవరణ ప్రతిపాదింపగా ఓడిపోయెను. దానిపై-తామును తమ అనుచరులును రాజీనామానిచ్చి మాళవ్యాపండితుడు-కాంగ్రెసువారు శాసనసభయందు లేనితరి ఆలోటు తీర్చి ఈ సమస్యయెడల జాతీయాంతర్జాతీయదృష్టి నాకర్షించి మహోపకారమొనర్చిరి. ఇంతకన్న వివరము కోరువారు కాంగ్రెసు చరిత్ర చూడుడు.

వీరిట్లు రాజీనామానిచ్చుట దేశమునకు మరియొక మహోపకారమును కలిగినది. దేశమున చెలరేగిన ఉప్పు సత్యాగ్రహము స్వాతంత్ర్యోద్యమమును ఆయన

దృష్టి నాకర్షించినవి. ఆయన యెన్నడును ప్రజాశక్తి విజృంభణము నిర్మాణపుమార్గముల పట్టించుటకే యత్నించుచుండును. దేశము కాంగ్రెసు ఆజ్ఞాను సారము అవలంబించిన ముఖ్యకార్యములలో విదేశ వస్త్రములబహిష్కార మొక్కటి. మాళవ్యాపండి తుడును అతని మిత్రులును వస్త్రసమస్యపైననే కావున పండితుడు ఆ కార్యక్రమము చేపట్టెను. పండితుడు మామూలు కాంగ్రెసువాదులవలె పెట్టుబడిదారులగు వర్తకులకు నష్టమువచ్చినరానీ తమ పంతము నెగ్గ వలయునని కోరు ప్రదర్శనప్రియులు. పెట్టుబడిదారుల ధనమైనను ప్రజాధనము దేశీయసంపదలో నొకభా గము కావున దానికిని నష్టమువచ్చుట కిచ్ఛగింపడు. 'కొంత నిర్ణీతకాలమువరకు విదేశవస్త్రముల దిగుమతి చేయును; వానికి ఆర్డరులివ్వము'—అని వాగ్దత్తము చేయువారికి ఉన్నసరుకు విడుదలచేసుకొనుటకు పండితుడు సమ్మతించెను. కాని గాంధీ అరెస్టు అనంత రము అలహాబాదున సమావేశమైన కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు మాళవ్యాపండితు డీయుద్యమము చేపట్టినందులకు హర్షించుచు ఈపద్ధ తిని నిరసించిరి. అయినను పండితుడు ఆగ్రహింపక వారితోకలిసి పని చేయసాగెను.

శాసనోల్లంఘనము నడుపుచున్న కాంగ్రెసు

కార్యనిర్వాహకవర్గములో సాంగత్యము వృథ కాలేదు. వర్కింగుకమిటీని మొత్తముగా బహిష్కరింపజొచ్చిరి. ఒక్కొకరాష్ట్రములోను బహిష్కరింపజొచ్చిరి? ఆసభయు ఒక్కొక్కరాష్ట్రమునకూడ సాగెను. జూలై నెలాఖరున బొంబాయిలో కూడెను. శ్రీమాళవ్యాపండితునికూడ వర్కింగుకమిటీసభ్యునిగా గైకొనిరి. 31 జూలై (1930) నాడు బొంబాయిలో లోకమాన్యతిలకుమహారాజు సాంవత్సరికోత్సవము జరుగుచుండెను. నాడు బొంబాయిపట్టణకాంగ్రెసుడిక్టేటరు శ్రీమతి హాన్సమెహతాగారు గొప్పయూరేగింపును సాగదీసిరి. ఆయూరేగింపున కొందరు కార్యనిర్వాహకసభ్యులును జేరిరి. వారందరికి ప్రభుత్వమువారు 144 వ సె. నోటీసునిచ్చి ఊరేగింపు నిషేధించిరి. కాని ఊరేగింపువారందరు పోలీసులడ్డగించినను అక్కడే నిలిచిపోయిరి. ఆరాత్రి కుంభవృష్టి కురిసెను. ఊరేగింపు జనము నీటిమధ్య కూర్చుండిరి. ప్రొద్దుననే ముఖ్యనాయకులను 100 స్త్రీలను అరెస్టుచేసి మిగతవారిని లాటీచార్జి చేసిరి. మామూలుగా పండితుడు ఆజ్ఞోల్లంఘనము నిచ్చగింపడు. కాని ధర్మవిదుడు అధర్మపుటుత్తరువులను పాలింప నిరాకరించును. ఉత్తమపౌరధర్మవేది పౌరసత్వపుహక్కులకై అచలస్థైర్యమున నిల్చి పోరా

చెను. ఇదివర కెన్నియోసార్లు ఆయన ఇట్టి ఉత్తరువుల నుల్లంఘించియుండెను. కాని నా డాయన నిర్బంధింపబడలేదు; మాళవ్యాను నిర్బంధించుట బ్రిటిష్ భారతపరిపాలనాధ్యాయమున అసంభవమగు హాంశమని పలువురు గాఢముగ విశ్వసించిరి. కాని 1930 ఆగస్టు 1-వ తేదిన ఆపని ఇంతలో జరిగిపోయెను. ఆరునెలలు శిక్షింపబడి జబ్బుచేయుటచే శిక్ష పూర్తికాకుండానే విడుదలగావింపబడిరి. కాని యింకను అస్వస్థతగానే యుండెను. అయితే 1931 జనవరి 21-వ తేదీన అలహాబాదు స్వరాజ్య భవనమున కాంగ్రెసు కార్యనిర్వాహకసభ జరుగగా అది చాలా ప్రాముఖ్యమైనదగుట మాళవ్యాపండితుడున్నూ హాజరైనాడు. 1930 ఆగస్టు మధ్యమందు సప్రూజయకర్ల జోక్యమువలన జైలులో గాంధీ నెహ్రూలు పటేలు మున్నగు వారితో సంధిగూర్చి సంప్రతింపులు జరిగియుండెను. 1931 జనవరి 19-న తేదిన ప్రథమరౌండు టేబిల్ సభాంతమున బ్రిటిష్ ప్రధాని మెక్డొనాల్డు యొక ప్రకటనగావించెను. ఆ ప్రకటనయందు కొంత రాజీసూచనలున్నట్లు తోచినది. పైగా లండనునుండి సప్రూశాస్త్రిగార్లు తాము వచ్చునంతవరకు ప్రధాని ప్రకటనపై వ్యాఖ్యానింపవలదని కేబిలు నంపిరి.

అప్పటి అధ్యక్షులగు రాజేంద్రప్రసాద్ గారి అధ్యక్షతక్రింద నీకార్యనిర్వాహకసభ సమావేశమై లాహోరు కాంగ్రెసు నిర్ణయించిన సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమునకు భంగములేకుండ స్లోకొంబు రాయబారమున గాంధీ ప్రభృతుల ఉత్తరముల లోని ధోరణ నామోదించుచు అందలిసూచనకు ప్రధాని ప్రకటనలో తగు సమాధానములేనట్లు భావించిరి. దేశమున పోరాటము సాగించుమనిరి." నిరంతరము సంధిగోరుచు అవగింజంతైన సమాధానమున కవకాశము కన్పించిన జారవిడువ జాలని పండితుడును ఈతీర్మానమునకు తన సమ్మతి నిచ్చెను. అంతేగాదు సంపూర్ణస్వాతంత్ర్యము నంగీకరింపకుండిన పండితుడు ఈతీర్మానమున దాని నంగీకరించెను.

పిదపజరిగిన గాంధీయిర్విన్ సంధి ప్రయత్నముల యథోచితముగా పాల్గొని నాడు పండితుడు. ఆ రాయబారముల మధ్యమందు ఒకానొకఅవస్థలో అందరు ఆశావిరహితులైరి. రాయబారములు భంగమైనట్లె భావించిరి. ఒక్కపడింతుడే ధృతిదూలని వాడు. ఆయన తలంచినట్లు తుద కంతయు సమాధానముగానే సవరణ యాయెను. ఆసమాధానఫలితముగా కాంగ్రెసు వాదులను రౌండుటేబిలుసభ

కాహ్వానింతుమనిరి. కాంగ్రెసు వారు గాంధీయొక్కడే రౌండు టేబిల్ సభకు వెళ్లవలయునని కాంగ్రెసు తీర్మానించెను. కాని గాంధీ-జాతీయతకు వెలిగాని హిందూ ప్రయోజనముల రక్షింపను మాళవ్యా పండితుడు అట్లే ఆయావర్గముల ప్రాతినిధ్యము వహింప సరోజనీ అన్సారీగార్లున్ను తనతో రావలయునని ఇర్విన్ ప్రభువుతో చెప్పినాడు. అట్లే పండితుడు ఆహ్వానింపబడెను. జిన్నా మొండిపట్టుచే అన్సారీ వెళ్ళజాల డాయెను. తీరా వెళ్లుటకుముందు యు. పి. గుజరాత్ మున్నగు రాష్ట్రీయుల సివిలియను అధికారులు గాంధీ ఇర్విన్ సమాధానమునకు వ్యతిరేకముగా వ్యవహరించుటచే ప్రజలపక్షము పూనిన పండితుడు గాంధీతో పాటు తన ప్రయాణ మాపుకోనలసివచ్చెను. కాని తుద కాయన గాంధీతోపాటు రెండవ రౌండు టేబిలుసభకు వేంచేసెను.

రాజీ-సమాధానము అన్నచోట మాళవ్యా పండితుడు ఉండితీరును. తొలుత విల్లింగ్డన్ ప్రభువు కొంతబిరుసుచూపి గాంధీతో సమాధానపడ నిరాకరించెను. కాని ప్రభాకర శంకరపట్టానీ, పండితుడు సహాయుడై మహత్ప్రయత్నమున విల్లింగ్డన్ ప్రభువును మెత్తపరచగలిగెను.

గాంధీఇర్విన్ ఒడంబడిక రోజులలో మరియొక విశేషమును జరిగినది. కరాచీలో కాంగ్రెసు సమావేశమునది. కాంగ్రెసుజరిగిననాటికి భగత్ సింగు (లాహోరు కుట్రకేసుశిక్షితుడు) మరిదీపినందున దేశమంతయు విషాదభూయిష్టమై యుండెను. సంపూర్ణస్వాతంత్ర్యము సిద్ధింపక ఏదో ఆటునుల రాజీ అయినదని గునియుచున్న యువజనులహృదయముల నీవార్తచే నీలిమబ్బు లలుముకొన్నవి. శ్రీభగత్ సింగుగుణగణముల విన్నమహాత్మునకును అతనిపై ఆప్యాయ మేర్పడినది. దానిఫలితముగా కాంగ్రెసులో సింగువిధానము నామోదింపక అతని త్యాగము నభినందించుతీర్మాన మొకటి గాంధిచే ప్రవేశపెట్టబడినది. అపివప రాజకీయహంతకుల నభినందించుటలు హెచ్చాయెను. దానితోపాటు దేశమందు రాజకీయహత్యలున్ను విస్తారమైనవి. ఈ రెంటికిసంబంధంగలదని గాంధీ భావించెను. బొంబాయిలో ఆగస్టులో (1931) జరిగిన అ. భా. కాం. సంఘమున నొకహెచ్చరిక తీర్మానమును ప్రవేశపెట్టిరి. దానిపై శ్రీమాళవ్యాపండితుని ఉపన్యాసము చరిత్రాత్మకమైనది:-

"మనము అహింసాధర్మానికి బద్ధులమై ఉండాలి. కాంగ్రెసు విధానం మారితే నమ్మండి. ముసలివాళ్లు

వెనుక బడరు. వాళ్ళు హృదయపూర్వకంగా సహా యంచేయను సంసిద్ధమైయుంటారు. తమప్రాణాల నింత నిర్లక్ష్యంగా ధారపోసుకుంటున్న ఈ కుర్ర వాళ్ళను చూస్తే నాహృదయం ముక్కలై పోతున్నది. తమ ప్రాణాలను ఉరిస్తంభాలకడ బలియిచ్చినవారూ, ద్వీపశిక్షలపాలై జైళ్ళలో మగ్గుతూ తమ జీవితాల నాహుతిచేస్తున్నవారూ అయిన కుర్రవాళ్ళను తలుచుకుంటే నాకు దుఃఖము వస్తుంది. ఈకారాగారాలల నుండిగాని ఈ ఉరి స్తంభములనుండిగాని ఒక్కకుర్రవాణ్ణి అయినా రక్షించడానికి నాప్రాణం సంతోషంగా ఇచ్చి వేస్తానే! వాళ్లిట్లా ప్రాణాలు ధారపోసుకున్నారు గాని లేకపోతే ఇంకా ఎంతెంత ఉపయోగకర మైనపనులు ఈ అమూల్యమైనప్రాణులు దేశానికి చేసిఉందురో? ఈ కుర్రాళ్లలో కొంతమందిని కల్నలులనేకాదు జనరల్స్ (ఉన్నత సైన్యాధి కారులు) చేసుకొని ఉందుము. ఏమిచేస్తాము వాళ్లు మనకు దక్కలేదు.

వీళ్ల నాదారినుండి తప్పించాలె. వాళ్లు నాశనము కాకుండా కాపాడాలె. వాళ్ల పద్ధతులు మనకిష్టంలె. వాళ్లంటే మనకు ఇష్టమే. మనకు వాళ్లయందుండే ప్రేమాతిశయంచేతనే వాళ్లు బ్రతికి బట్టకట్టాలెనని

వాళ్లకు క్షేమకరమైన రాజమార్గము చూపిస్తున్నాము.

స్వాతంత్ర్యము సాధించడానికి ఇతరమార్గాలు లేవని నేనెన్నడూ చెప్పను. మనకిష్టముంటే శస్త్రరహితమార్గాలవలెనే, శస్త్రసహితమార్గానకూడా యుద్ధముచేయడానికి మనకు హక్కున్నదని నావిశ్వాసము. ఎవ్వడూ ఇది కాదనలేదు. సౌకర్యంకొరకు అపాయములేని ఈ ఉపాయమును అవలంభించాను."

మాళవ్యాపండితుడు సంస్కారప్రియుడగు పూర్వాచారపరాయణుడు. కావున వా రింగ్లాండు ప్రయాణమగుట దేశభక్తికరమగు కార్యమైనది. అయిన వారు తమ ఆచారమునకు భంగములేకుండా దారిలో (స్టీమరుపై) త్రాగడానికి ఆయన తనవెంట 160 సీసాల ఆవుపాలు పట్టుకొని వెళ్లుతున్నాడట. స్టీమరులో వంటకూడా చేసుకోవడానికి ఏర్పాటుచేసుకున్నాడు. గంగోదకం గంగామృత్తికకూడా వెంట పెట్టుకొని వెళ్లినాడు.

రౌండుటేబిల్ సభ.

రౌండుటేబిల్ సభకు సెప్టంబరు మొదటివారంలో హాజరైనారు. వీరు మొదట హాజరైన సభ—ఫెడరల్ స్ట్రక్చర్ కమిటీ. శాంకీప్రభువు దాని

కధ్యక్షతవహించినారు. శాంకీప్రభువునకు కుడి ప్రక్కన వారి ఆంగ్లేయబలగమంతా పీలు, రీడింగు సైమన్ ప్రభృతులంతా కూచున్నారు. ఎడమ ప్రక్కన తొలుతగా మహాత్ముడు కూచున్నాడు. ఆపిదప మాళవ్యాపండితు డాసీనుడైనాడు. మహాత్ముని అనంతరం మాళవ్యాపండితుడు కూడా కాంగ్రెసుపలుకే పలికినాడు. కాని రాయబారములలో హిందువుల న్యాయమగు హక్కులకు నష్టము లేకుండా మహాత్మునికి సలహా ఇవ్వడమే పెట్టుకున్నాడు.

రెండు టేబిలుసభావ్యవహారములోముఖ్యమైన ఘట్టము మైనారిటీసమస్యాపరిష్కారఘట్టమే. అది ఎట్లా నడిచినదీ దానివిషయంలో మాళవ్యాపండితుడు ఏవిధంగా వ్యవహరించినదీ శ్రీ ఖాన్ బహాదూర్ హాఫిజ్ హిదయత్ హుస్సేన్ (1934 లో ఎం. ఎల్. సీ.) రెండు టేబిల్ మహాసభాసభ్యుడు మాటలలో వివరింతును:

"28-9-1931 తేదిన మైనారిటీలకమిటీ ప్రథమ సమావేశమైనది. చాలా క్లిష్టమైనది. కాన్ఫరెన్సు వారికి చిక్కులుకల్గించుచున్నది. అయిన ఈసమస్యను (మైనారిటీస్) పరిష్కరించుకొనుడని మెక్డొనాల్డ్ ప్రధాని సభ్యులనందరిని (గాంధీనిసహా) హృదయ

పూర్వకముగ నర్థించియుండెను. శ్రీమాళవ్యా పండితుడున్నూ, ఆగాఖానుగారున్నూ కోరగా ఒక వారమాసభ వాయిదా వేయబడెను. మతపాక్షిక విషయములనిర్ణయించుటకై ప్రతిసంఘమునుండి 3 గురు లేక 4 గురుసభ్యులతో నొక-చిన్నకమిటీ ఏర్పడవలయునని 30-9-31 తేదిన నిర్ణయింపబడెను. ఈచిన్నకమిటీ ఏర్పడినది. ఈకమిటీ 2-10-31 నుండి 8-10-31 వరకు మహాత్మాగాంధిగారి అధ్యక్షత క్రింద సమావేశమైనది. అంతట నది ఒకసమాధానమునకు రాజాలమైతిమని ప్రకటించినది. ఆరోజుననే పిదప (8-10-31) తిరిగి మైనారిటీల కమిటీ సమావేశమైనది. మెక్డొనాల్డు ప్రధాని బ్రూసు సాలీడుకథ చెప్పి తిరిగి ప్రయత్నింపుడని సభ్యులను కోరెను.

తిరిగి రాయబారములు ప్రారంభమైనవి. గాంధీ పంజాబునందలి ముస్లిములను, సిక్కులను, సింధు, పశ్చిమోత్తరపరగణాలయందు హిందువులను మాత్రమే మైనారిటీలుగా అంగీకరింతుననెను. రాయబారములు విఫలమగుటకు ముఖ్యకారణములలో నది యొకటి. మరియు గాంధీ వీరితోనైన ఈమైనరటీలవారు భారతీయక్రైస్తవులు, ఆంగ్లోయిండియనులు, సరే యూరపియనులు—మైనారిటీలని ఏ

విధముగా లెక్కబెట్టుటను ఆక్షేపించి ఎదుర్కొం దుమని" వాగ్దత్తముచేసిననే రాజీమాటలు మాట్లా డుదు ననెను. ఈసందుకట్ల నవకాశముగా గొని మైనారటీలందరు తమలోతాము సమాధానమును కుదుర్చుకొనిరి. గాంధీ తన సూచనలను మెక్డోనాల్డు పరిష్కారమువిడువలేనని తలంచెను. పై సమాధాన ముతో నాతలంపు తారుమారైనది. అప్పుడు తన సూచనను మాళవ్యాచే ప్రకటింపజేసెను. ఆసూచ నలను "టైమ్సు" పత్రిక తనసంపాదకీయమున బల పరచెను. 13-11-31 మైనారిటీకమిటీ తిరిగీ సమా వేశమైనది. మైనారిటీలు శవాన్నికోసి పంచుకుంటు న్నారని ఆక్షేపిస్తూ—వారిప్రత్యేకపుటొడంబడికను నిరసించెను. ప్రధాని సభను తిరిగీ వాయిదా వేయుచు ఇట్లు చెప్పెను.

మీలో ప్రతివారును, ఈకమిటీలో సభ్యులు ప్రతివారును ఈమతపాక్షికసమస్యపరిష్కరింతుమని వ్రాసి చేవ్రాలుచేసి యిస్తారా? నీనిర్ణయము నంగీక రిస్తామని ప్రతిజ్ఞచేస్తారా?" 14-11-31 తేదిన గాంధీముస్లిం డెప్యుటేషనువారిని కలుసుకున్నారు. వారినీ మైనారిటీస్ ఒడంబడికనుంచి విడదీయ ప్రయత్నించినాడు. పార్టీలు వ్యష్టిగా సమష్టిగానీ ఒడంబడికకు కట్టుబడియున్నారనివారికి తెలుపబడెను.

ఆరోజుననే హిందువులకు, ముసల్మానులకు, సిక్కులకు రాజీకుదుర్చుమని మాళవ్యా ప్రధానమంత్రికి లేఖ వ్రాసెను. ఆలేఖలో శ్రీధర్భంగామహారాజావారు శ్రీమతి సరోజనీనాయుడు, పండిత నరేంద్రనాథు, డా॥ ముంజీ, జి. డి. బిర్లా, యం. ఆర్. జయకర్, వి. రంగస్వామిఅయ్యంగారు ప్రభృతులు దస్కతులు పెట్టిరి. ఈలేఖపంపునప్పుడు గాంధీయన్నమాట వాస్తవము. ఆరోజుననే కొన్ని గంటలైనపిదప గాంధీ కాంగ్రెసున కేకైకప్రతినిధిగా తాను మాళవ్యాలేఖలో దస్కతుచేయనంతమాత్రమున ప్రధానమంత్రియిచ్చుపరిష్కారమును కాంగ్రెసు యద్వాథముగాను ఎదుర్కొనునని అర్థముకాదు— అని ప్రధానికి ఉత్తరమువ్రాసెను. దానివెంట అదే ధోరణిలో సప్రు వ్రాసెను. 15 - 11 - 31 న శాస్త్రి శిడ్ల్‌వాడీ పాత్రో సెత్నాగార్లును మరో ఉత్తరమల్లే వ్రాసిరి.

పైనవివరించిన తికమకలకన్నిటికి కారణములు కలవు. కేవలము రాజకీయసమస్యనుగూర్చి గాంధీ మాళవ్యాలు ఉపన్యసించినపుడు ఆంగ్లరాజనీతిజ్ఞులు ముగ్ధులై నిరుత్తరులైనారు. కాని వెంటనే వారు కళ తెలుసుకున్నారు. మైనారిటీసమస్య చేతికందినది. వివరములలోనికి జారబడిన గాంధీ అవకతవకే

లొనర్చునని వారి కోరుకయే. ఆసమస్య పై కితీయ గనే స్వాతంత్ర్యప్రియులగు భారతీయులందరు కష్టలతక్కొడపతు అగుదురని వారిధైర్యము. పైన పేర్కొన్న చిన్నసంఘము (గాంధీఅధ్యక్షతక్రింద) బ్రిటిష్ వారి ఆశలు చిగిరించున ట్లొనర్చినది. ముస ల్మానులు, భారతక్రైస్తవులు, సిక్కులు, నిమ్న జాతులు, స్త్రీలు, యూరపియనులు అందరికిన్ని తగువా రేర్పడి ఆంగ్లేయులు శివ మెక్కించగా ప్రత్యేకప్రాతినిధ్యము కోరజొచ్చిరి. కొంత వాద వివాదాలుకాగా ఈ క్రిందిప్రధానవిషయములు ప్రాతి పదికగా చర్చించి ఒక సమాధానానికి వత్తుమన్నారు. (1) కేంద్రశాసనసభలో బ్రిటిషుభారతస్థానములలో శివ భాగము మహమ్మదీయుల కివ్వాలని,(2)బంగాళా పంజాబు శాసవసభలలో 100 కి 51 వంతులు ముసల్మానులకు సానము లివ్వవలెనని (3) మిగత రాష్ట్రములలో దామాషాకన్న కొంచము హెచ్చు స్థానము లివ్వమని (4) సంయుక్తనియోజకవర్గాలు రెండున్నూ ఉండాలని తత్క్షణమే నియోజకవర్గ సమస్యగూర్చి బాహుళ్యముమీాద అభిప్రాయము కనుక్కోవాలని ఈపథకం. మహాత్ముడున్నూ ఈవిధ మొకవిధముగా సమ్మతించినాడు. అయితే ముస ల్మానులు ప్రధానరాజకీయసమస్యపట్లకూడా తమ

సవరణల తెచ్చినారు. ఆర్థికస్వాతంత్ర్యము పూర్తిగా (౨) సైన్యంమీాద అధికారమేగాని పరిపాలనకాదు. (౩) విదేశవ్యవహారములు వప్పుకుంటాము కాని సంపూర్ణస్వాతంత్ర్యము కాదు; అధినివేశపరిపాలనమునకే అంగీకరిస్తాము. దీనిపై హిందువులు శిఖులు, ఇతరమైనారిటీలు మూతివిరిచారు. బహుశా ఈసందర్భముననే భారతస్వాతంత్ర్యమునకు హిందువులన్యాయమగుహక్కులకు భంగకరమగు పైసూత్రములను గాంధీ మెత్తబడినను వప్పుకోకుండా మాళవ్యాపండితుడే తగినసలహా యిచ్చియుండును. ముసల్మానులనుతూకంగా ఇతరమైనారిటీలను సమ్మతించి రాబట్టజాలకపోవడం గాంధీరాజనీతికిలోటు అని కొందరి అభిప్రాయము. బహుశా ఆ ఉద్దేశంతోనే మాళవ్యాపండితుడు చిరకాలభారతమిత్రుడైన మెక్డొనాల్డును ఆసమస్య పరిష్కరింపకోరినాడేమో! ఇందుకు కొందరు వారి నాక్షేపింపవచ్చును. కాని వారు బ్రిటిష్ న్యాయము పరమవిశ్వాసముతో రాజకీయములారంభములైననాటివారు. అట్టివారికి గలవిశ్వాసములు సడలుట సులువుకాదు. కాని తీరా మెక్డొనాల్డుగారితీర్పు (కమ్యూనల్ అవార్డు) బయటపడగానే ముసల్మానులకు ఝుడిసి మ్రింగుటకు వెళ్లగాయుటకు

జంకి గ్రుష్టు మిటకరించినసోదరకాంగ్రెసువాదులవలె గాక దానిని ధైర్యస్థైర్యములతో నెదుర్కొనిన సాహసికుడు !

రౌండుటేబిలుకాన్ఫరెన్సునుండి మాళవ్యా గాంధీలు ఇంగ్లాండునుండి తిరిగివచ్చినంతనే యిచ్చట వ్యవహారమంతయు తీవ్రశాసనోల్లంఘనమున కొక వంకయు, తీవ్రతరనిర్బంధవిధానమునకు మరొక వంకయు సర్వము సంసిద్ధమైయుండెను. వారు వచ్చిన కొలదిరోజులలో దేశమంతటను (1932-34) రెండును చెలరేగిపోయినవి. అప్పుడు మాళవ్యా తనకర్తవ్యనిర్వహణ మెట్లొనర్చె నగుటనుగూర్చి డా॥ భోజరాజు పట్టాభిసీతారామయ్యగారి "కాంగ్రెసు"చరిత్రనుండి నాలుగుపంక్తులను వ్రాసెదము.

"ఈకాలమందంతటా (1932 - 34) నిర్బంధింపబడక స్వేచ్ఛగానుండిన కాంగ్రెసునాయకు డాయన యొక్కడే. రౌండుటేబిల్ మహాసభనుండి తిరిగివచ్చి భరతభూమిపై కాలుపెట్టినదాది, వయస్సుమీరి, ఆరోగ్యము మందగించియున్నను ఆయన ఎన్నడును తలదాచుకొలేదు. ఎల్లప్పుడు ఎడతెరిపిలేకుండా కృషిచేసెను. అధికారులు అత్యాచారములగూర్చి స్టేటుమెంటు లిచ్చుట యొకవంక, ఉత్సాహముగల

కాంగ్రెసుసేవకులను తన అకుంఠితదీక్షచేతను అద్భుతమగు శక్తిచే ప్రోత్సహించుట మరొకవంక. అనుమానము కల్గినపుడు, ఆటంకము లేర్పడినప్పుడు కాంగ్రెసుసేవకులు ఆయన అండచేరిరి. వారి కెన్నడును ఆయన ఆశాభంగము కల్పించలేదు."

మార్చి (1932) లోనే మాళవ్యాపండితుడు ఇచ్చట అధికారుల దుండగములనుగూర్చి ఇంగ్లాండునకు 1100 మాటల టెలిగ్రాముల నిచ్చినారు. కాని పోస్టల్ అధికారులు పోనివ్వలేదు.

1932, 33 ఏప్రెల్ మాసములలో వరుసగా ఢిల్లీ కలకత్తాలలో కాంగ్రెసుమహాసభలు సమావేశమైనవి. ప్రభుత్వమువారు కడుజాగరూకులై కాపలా కాచిరి. 'ప్రతినిధులు' అని అనుమానమున్నవారినెల్ల అరెస్టుగావించిరి. ప్రొఫెసర్ రంగా, కొండ వెంకటప్పయ్యపంతులుగారు మున్నగు పెద్దలెందరో బయలుదేరగనే అరెస్టయిరి. ఢిల్లీకాంగ్రెసున కధ్యక్షులుగా శ్రీమాళవ్యాపండితుడే ఎన్నుకోబడెను. అసలామహాసభకు పథకమంతయు ఈవృద్ధసింహమే వైచినది. వైస్‌రాయి నివాసమున్ననగరమున ప్రభుత్వపుటుత్తరువులకు భిన్నముగా కాంగ్రెసుమహాసభజరుపుట. పోలీసువారివేగు వికలపరచి చాందినీ చౌకున 500 మంది ప్రతినిధులు సమావేశమై 4 గు

తీర్మానములుగావించుట. ఈవృద్ధమితవాది హృదయమున ఎంతటి వ్యూహరచనాశక్తి అంతర్యామితమైనది! కోటీశ్వరులు కొందరు ఎట్లైనను మాళవ్యాపండితునే రహస్యముగా ఢిల్లీనగరమునకు చేర్చి మహాసభాధ్యక్షత వహింపచేయవలెనని తలంచిరట ప్రభుత్వపునౌకరులు ఢిల్లీకిగలదారులన్నిగాను అరికట్టినను అర్ధరాత్రమున తాత్కాలికపు వంతెనపై యమునానదిని ఏదే నొక్కచో దాటించుటకును ఉద్యుక్తులైరట. కాని ఈస్థితప్రజ్ఞుడు వానిలో దేనిని అంగీకరింపలేదు. బాహాటముగా కారులో ఢిల్లీకి బయలుదేరి దారిలో నిర్బంధితుడాయెను.

హరిజనుల ప్రత్యేకప్రాతినిధ్యము తొలిగింప మహాత్ముడు 1932 శెప్టంబరులో ఉపవాసముచేసినప్పుడు మాళవ్యాపండితుడు మిగతనాయకాగ్రేసరులవలె చేతులుపిసుకుకొనుచు పత్రికలదీర్ఘప్రకటనలగావించుటతో తృప్తిపడక వెంటనే బొంబాయిలో నాయకులసమావేశము నేర్పాటుగావించి మెక్డోనాల్డుగోరినట్లు మనలో మనవారు సమాధానపడుటకు మార్గమేర్పరచెను. అస్పృశ్యతానివారణకు పూనాఒడంబడికపై హిందువులతరపున దస్కతుచేశినారు.

శాసనోల్లంఘనప్రహాంగం అణిగినది. శాసనసభ ప్రవేశవాంఛడా॥ ఆన్సారీ, డా॥ భిధన్‌చంద్రరాయి, షెర్వానీ ప్రభృతులకు కలిగినది. కీ॥శే భూలభాయి గారు వారికి తోడైనారు. శ్రీ ఖాన్ రాజాజీగారు తెర చాటుకైంకర్యము చేయుచున్నారు. శ్రీమాలవ్యా పండితు డెన్నడున్ను శాసనసభలప్రజాహితకార్యములకై ఉపయోగింపవలయుననువాడే. కావున పైవారు వీరిని ముందుంచుకొని వ్యవహరింపసాగిం చిరి. పాట్నాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీసమావేశమునకు శ్రీమాళవ్యా అధ్యక్షులైరి. 1933 మార్చి 31 వ తేదిన కలకత్తాలో కాంగ్రెసుమహా సభ ఏర్పాటైనది. 2000 పైగా ప్రతినిధులు విచ్చే సిరి. మాళవ్యాపండితు డేఅధ్యక్షులుగా నిర్ణయింప బడిరి. శ్రీమతి మోతీలాలునెహ్రూసతి వృద్ధురాలయ్యు, అశక్తురాలయ్యు స్వాతంత్ర్యనిరతిచే ఆసభకు విచ్చేయ నంగీకరించెను. కాని మాళవ్యా పండితుని వారితోనున్న మోతీలాలుసతిని డా॥ సయ్యద్ మహమ్మద్‌ను అందరి నరెస్టుచేసిరి. ఆక్టింగ్ కాంగ్రెసుప్రెసిడెంటు శ్రీ యమ్. యస్. ఆనీగారిని అరెస్టుగావించిరి. శ్రీమతినెల్లి సేనుగుప్త సతి డా॥ ఆలంగార్లకు నిషేధపుటుత్తరువులు జారీ చేసిరి. కాని మాళవ్యాపండితుని మహావిశేష

మేమోకాని 1700 మందిదాకా ప్రతినిధులు సమావేశమైరి. నేనుగుప్తసతి అధ్యక్షతవహించినది. పోలీసులువచ్చి తీవ్రమగులాటీఛార్జిచేసిరి. కాని సభాసదులు కదలకమెదలక నిల్చి లాటీవర్షముమధ్య తయారైయున్న 7 తీర్మానములను గావించిరి. అందరు అరెస్టుగావింపబడి విడువబడిరి. మాళవ్యా పండితుడు ఏప్రిల్ 3 వ తేదికి కలకత్తాచేరెను. పోలీసుల అత్యాచారముల వినెను. శ్రీమతి నెల్లి నేనుగుప్తసతియు లాటీదెబ్బలకు గురి ఆయెనని తెలిసెను. వెంటనే ఆసంగతులన్నియు మాళవ్యా ప్రకటించినాడు. బహిరంగవిచారణచేయుమని ప్రభుత్వమును సవాలుచేసినాడు. అయితే ఆసవాలును ప్రభుత్వము గైకొనజాలకపోయెను.

పిదప పాట్నాలోజరిగిన అఖిలభారతకాంగ్రెసు కమిటీయందు (1944 మే) తరువాత జరుగవలసిన కాంగ్రెసుసమావేశమును శ్రీమతి సరోజినీదేవిగారు బొంబాయి కాహ్వానించిరి. దానిని 46 వ సమావేశమనవలెనా లేక 48 వ ది అనవలెనా యని కీ. శే. బజాజ్ గారు అవ్యక్తముగా ప్రశ్నించిరి. దానిపై వృద్ధసింహము, మాళవ్యాపండితు డుద్రిక్తుడై ఇట్లు పల్కెను.

"ప్రభుత్వముచే నిషేధింపబడిన ఢిల్లీ, కలకత్తా సమావేశములు మిగత ఏ యితరమువలెనే చాల ప్రాముఖ్యములైనవి. కావున రాబోవుసభ 48 వది అగును."

అందరును హర్షధ్వను లొసర్చిరి.

పండితుడే అధ్యక్షత వహించెను. గాంధీయే శాసనసభాప్రవేశపుతీర్మానము ప్రతిపాదించినారు. మాళవ్యా ఆన్సారీగార్లను 25 గురు కాంగ్రెసు వాదులతో నొక ఎన్నికలసంఘము నేర్పరుపు మనియు, వారే ఎన్నికల నడుపవలయుననియు ఆ తీర్మానము. ఆతీర్మాన మేకగ్రీవముగా తీర్మానింపబడి నది. ఆసభలో నొక చమత్కారము జరిగినది. తీవ్రమగు వాదోపవాదములు జరిగినమీాదట మాళవ్యా పండితుడు బయట టీ సిద్ధమై యున్నది; ఆపానీయము వలయువారు వెళ్లవచ్చును; సభమాత్ర మాగక సాగును అని చెప్పిరి. రెండునిమిషము లలో హాలంతయు కాళీ అయినది. ఇద్దరు ముదుసలులు గాంధీమాళవ్యాలుమాత్రమే నిల్చిపోయిరి. ఒకగంట సభ వాయిదా పడినది.

పై తీర్మానానుసారము వివిధరాష్ట్రములనుండి ఏలువురు ప్రముఖులతో నొకపార్లమెంటరీబోర్డు ఏర్పాటైనది. దీని కన్సారీగా రధక్షుల్యలు. వారు

లభ్యముగానప్పుడు శ్రీమాళవ్యాపండితుడు అభ్యర్థుడు అని నిశ్చయింపబడెను.

శ్రీమాళవ్యాపండితుని అన్సారీ ప్రభృతులు తమతో చేర్చుకొనుటలో మరొక అంతరార్థము కలదు. శ్రీమాళవ్యాపండితుడును, శ్రీమాధవవర్మా అనేగారున్నూ- ఇంక నట్టివారు పలువురు హిందూ ప్రముఖులున్నూ, "కమ్యునల్ అవార్డు"- హిందువులహక్కులకు ప్రతిబంధకము అని తలంచిరి. కాని ఇది ముసల్మానులకు లాభసాటి యగుటచే కాంగ్రెసు ముసల్మానులు సహా దానికి హర్షించిరి. కాని అన్సారీ ప్రభృతులుమాత్రము పైకి తియ్యగ సాకులు చెప్ప నారంభించిరి.

రాంచీ స్వరాజ్యపార్టీపునరుద్ధరణసభలో శ్వేతపత్రముపై నిప్పులుగురిపించిన పెద్దలెవ్వరున్నూ ఈకమ్యునల్ అవార్డును అధిక్షేపించినవారు లేరు. ఒక్క డా॥ బి. సి. రాయిగారున్నూ, తులసీచరణ గోస్వామిగారున్నూ (ఉభయులు బంగాలీయులు) మాత్రమే ఒకటిరెండుమాటలు చెప్పిరి. రాంచీ పార్టీసభలమధ్యకాలమున అలహాబాదునందు హిందూ పత్రికావిలేఖరితో ప్రసంగిచుచు ఇట్లు చెప్పినారు:—(14-5-34)

"ఈరోజున మన ఎదుటయున్న సమస్య కమ్యూనల్ అవార్డుకాదు; మరియే విషయమున్నుకాదు. శ్వేతపత్రమును తిరస్కరించుట, నిర్బంధశాసనములను రద్దుపరచుట."

అదే ప్రసంగముననే వారు "నాము కాంగ్రెసువాదులందు అన్నిపక్షములవారి విశ్వాసము చూరగొనుచున్నందులకు" గర్వించిరి.

కాని పాట్నాసభానంతరము 21-5-34 వ ఢిల్లీలో అన్సారీగారొక ప్రకటనగావించుచు దానిలో నిట్లు పల్కిరి.—

"చాలమంది హిందువులు, సిఖులు "కమ్యూనల్ అవార్డును" తీవ్రముగా నాక్షేపించుచుండగా ముసల్మానులు, హరిజనులు, క్రిశ్చియనులు, పలువురు తమలో తమకు అంగీకారయోగ్యమగు సమాధానము కుదురునంతవరకు దాని నంగీకరింపదలంచిరి. ఈసంగతి కాంగ్రెసు కెరుకయే. ఈసమస్యకు జాతీయ పరిష్కారము సాధింప కాంగ్రెసు ఎప్పుడును కృషి చేయును. అయితే, నా అభిప్రాయమున, జాతీయ రాజ్యాంగచట్టము నేర్పరచుటకై కాన్స్టిట్యూయెంటీ అస్సెంబ్లి సమావేశమగునంతవరకు ఈసమస్యకు పరిష్కారవిధానము చేకూరజాలదు. అంతవఱకు, 'కమ్యూనల్ అవార్డులో' చెప్పబడినవిధమున

ప్రాతినిధ్యము, దానిని బడయుపద్ధతి-అంగీకరించుటా, నిరాకరించుటా అన్నేప్రశ్న ఉదయింపనే ఉదయింపదు.

రాంచీయందు తదనంతరము అంతస్పష్టముగాకె పాట్నాయందు ఆ ప్రశంసయే లేక వెంటనే ఢిల్లీలో శ్రీ డా॥ అన్సారీగా రిట్లు ప్రకటించుటకు కారణము లేకపోలేదు. పాట్నా కాంగ్రెసుసభకు శ్రీ భోపాలునవాబుగారు కమ్యూనల్ అవార్డు తటస్థభావమును కాంగ్రెసు అవలబింపకపోతే జాగ్రత్తయని బెదిరిస్తూ కీ. శే. షెర్వానీగారిని అలంకరించి పంపిరి. హరిజనసమస్య ప్రాయోపవేశ మొనర్చిన గాంధి 'కిం' అనలేదు. డా॥ అన్సారీ—"తనఅభిప్రాయమును" కాంగ్రెసుపై రుద్ది—'కాంగ్రెసు వారిలో అన్నిపక్షములకు తమయందుగల విశ్వాసమును సద్వినియోగము గావించుకొనెను! ఆ తటస్థభావమే నేడు ముస్లింలీగునకు కొమ్ములుకోరలు తెచ్చిపెట్టినది. నాటికాంగ్రెసువాదులలో గాంధిని కాదని పెద్ద లెవ్వరును పైకిపొంగలేదు. ఒక్కమాళవ్యా పండితుడు మాత్రము దీనిని సహింపజాలడయ్యెను. వారికి ఆనేగారు బాసటలై నిల్చిరి. యు. పి., సి. పి., బంగాళము పంజాబులందు మరికొందరు వారిపక్షమున చేరిరి.

కాని శ్రీమాళవ్యా సంఘటనను ఎదురుతిరుగకుండ నిలుపరించుటకు కెంతో ప్రయత్నము జరిగెను. రాంచీ పాట్నాలనాటకము చూచిన మాళవ్యాపండితునకు హృదయము కలుక్కునిపోయెను. చిరకాలపురాజకీయసంస్థయగు కాంగ్రెసునకు జాతీయతామూలచ్ఛేదకమగు "కమ్యూనల్ అవార్డు"ను ప్రతిఘటించు ధైర్యసాహసములు సన్నగిల్లుట ఆయనకు స్పష్టమైనది. "తిరస్కరింపము అంగీకరింపము" అను సంగి మాటలు క్రూరముగా తోచెను వృద్ధుడయ్యు వీరాంశగల యోధుడగుట మహారాష్ట్రనాయకుడు బాహాటగా తిరస్కారపతాకము లేవనెత్తెను.

పాట్నాపిదప వార్ధా బొంబాయిలలో కాంగ్రెసు కార్యనిర్వాహకసభ కూడినది. బొంబాయిసభలో కాంగ్రెసుపార్లమెంటరీబోర్డువారు వర్కింగుకమిటీ వారికి 'కమ్యూనల్ అవార్డు' పైగల అభిప్రాయమును స్పష్టీకరింపగోరగా అనాసక్తిప్రబోధిత "ద్విముఖాభిప్రాయము" స్పష్టముగా చెప్పబడినది. శ్రీమాళవ్యా ఆనేగార్లు కాంగ్రెసుపార్లమెంటరీబోర్డు కార్యనిర్వాహకవర్గములుగల తమసభ్యత్వములను రాజీనామానిచ్చి వానితో తమసంబంధమును త్రెంచుకొనిరి. కాని కాంగ్రెసువర్కింగుకమిటీవారు అంతటితో విడువలేదు. జూలై నెలాఖరులో కాశీయందు

వాయ కూడిరి. శ్రీమాళవ్యా ఆనేగార్లతో తిరిగీ రాయబారముల ప్రారంభించిరి. వీరిరువురు తెగబడిన హిందూసంఘమున చీలజడి రేగునని వారెరుంగుదురు. కావున తమ 'స్వాతంత్ర్యాభిప్రాయము' మినహాగా అన్నివిధముల వారితో సమాధానపడ యత్నించిరి. గాంధీ-ఎలక్షన్లలో అభ్యర్థులుగా నుండగోరువారికి 'కమ్యూనల్ అవార్డు' ఎడల అంతరాత్మసంబంధమగు ఆక్షేపణలున్నచో దానిని గమనింపరాదని సూచించెను. కాని ఇది చాలదని మాళవ్యా ఆనేగార్లకు తోచినది. వారి రాజీనామా లంగీకరింపబడినవి.

మాళవ్యా ఆనేగార్లంతటితో నూరకొనలేదు. ఆగస్టు 18,19 తేదులలో (1934) కలకత్తాయందు కమ్యూనల్ అవార్డు వ్యతిరేకులసభను వీరిరువురు సమావేశపరచిరి. బంగాళారాష్ట్రము కమ్యూనల్ అవార్డునందుముస్లిములసందర్భముగానేగాక పూనా పాక్టువల్ల హిందువులసీట్లలో కొన్ని హరిజనులకు పోగా అచటి హిందూసంఘమున అసంతృప్తి మిక్కుటమై యుండెను. ఆసభవారు కేవలము కమ్యూనల్ అవార్డును శ్వేతపత్రమును నిరసించుటలో తృప్తినందక రానున్న కేంద్రశాసనసభల ఎన్నికలలో (1934 లోనే జరిగినది) తమ అభ్యర్థులను నిలువ

బెట్టవలయుననియు తీర్మానించిరి. దానికి తోడుగా కార్యనిర్వాహకవర్గము, (కాంగ్రెసు)వారి తీర్మానమును పునర్విమర్శింప అ. భా. కాంగ్రెసుకమిటీ సమావేశమగుట అనవసరమనియు తీర్మానించి కార్యనిర్వాహవర్గము వారి కంపిరి. కార్యనిర్వాహకవర్గమువారికి నచ్చివెలగకాయ గొంతుకబడినది. మాళవ్యా ఆనేగార్లసభ్యులను ఆహ్వానించిరి. అ. భా. కాం. సం. సమావేశమునుగూర్చి కడుదీర్ఘముగా చర్చించిరి. తుదకు సాంకేతికాక్షేపణలతో నవి వీలు కాదనిరి. తిరిగి "అంతరాత్మ వ్యతిరేకవాదులను" మినహాయింపు చర్చింపబడెను. ఇంతలో గాంధీ యొక్క రాజీపద్ధతి సూచించెను. ఉభయుల అభ్యర్థులలో ఎవరికి హెచ్చుగెల్పు అవకాశమున్నప్పుడు వారికి రెండవపార్టీవారు వదలివేయవలయును అని సూచింపబడెను. కాని అట్లు సమాధానము కుదరలేదు. ఆఖరుకు మాళవ్యా ఆనేగార్ల సీట్లును, సింధురాష్ట్రమున కలకత్తాపట్నమున అభ్యర్థుల పెట్టకుండుటకు తీర్మానించుకొనిరి.

ఎన్నికలలో (కేంద్రశాసనసభ) కాంగ్రెసు నేషనలిస్టుపార్టీవారు (ఆనేగారి కొత్తపార్టీ) అభ్యర్థులనుంచి పోరాడిరి. బంగాళమున అన్ని జనరల్ సీట్లు కాంగ్రెసు నేషనలిస్టుపార్టీవారికే దక్కినవి. పంజా

బులో కాంగ్రెసు కొక్కసీటే ఇట్లు శ్రీమాళవ్యా సమయమువచ్చినప్పుడు కాంగ్రెసు నాయకబృంద ముతో ధర్మయుద్ధముగావించి హిందువులహక్కు లకై నిలిచినాడు.

అట్లు కాంగ్రెసుఅధికారపక్షమువారి తీర్మానముపై ధ్వజమెత్తియు కాంగ్రెసును మలముచేరుచుకో లేదు. ప్రతికాంగ్రెసుసభన్నూ హాజరగుచు తమ అభిప్రాయములు నిర్భీతమై వెలిబుచ్చుచువచ్చిరి. బాగుగా వృద్ధావస్థ మేర్పడి అవశులైన పిదపనే మానివైచిరి. కాని ఏ ప్రాముఖ్యమైన సందర్భమున నైన ఆయన ఎచ్చటి స్థితియందున్నను ఆయన వాణి వినపడకపోదు.

## కాశీవిశ్వవిద్యాలయము

ఇటు రాజకీయుల, కాంగ్రెసు హిందూమహా సభల విరివిగా పాల్గొనుచు, అటు విద్యారంగమున కాశీవిశ్వవిద్యాలయమును నిర్వహించిరి. కాశీవిశ్వ విద్యాలయమున ఆయన కొన్నికోట్లు సంపాదించెను. మిగత అన్నివిశ్వవిద్యాలయములకన్న మిన్నగా దాని నభివృద్ధిపరచెను. మద్రాసురాష్ట్రమున తెవిశ్వ విద్యాలయములుండియు, కాశీవిశ్వవిద్యాలయము నకు హెచ్చుగా నీరాష్ట్రమునుండ విద్యార్థులు పోవుచుందురనగా దాని ప్రాశస్త్యము చెప్పనక్కర

లేదు. మాళవ్యాపండితుడు వృద్ధుడై ఇక నావిశ్వవిద్యాలయవ్యవహారభారము పూనజాలనన్న కాలమున శ్రీరాధాకృష్ణన్ గారు ఆభార మెత్తుకొనిరి. శ్రీరాధాకృష్ణగారి నియమింపబడుటకు గాంధీ కొంత కృషిచేసె నందురు. ఈ కాశీవిశ్వవిద్యాలయమున మాళవ్యాకోరికలలోను అశక్యమైయుండిన లోటుపాట్లాటి రెండును అంతరించినవి.

ఆ విశ్వవిద్యాలయము పేరుప్రఖ్యాతులకు మూలము, విద్యార్థులును విరివిగా నావిశ్వవిద్యాలయమున కెగబ్రాకుటకు కారణము. ఆవిశ్వవిద్యాలయము విద్యార్థులకు సభాస్వాతంత్ర్యము జాతీయాభిమానమునను గల ప్రోత్సాహము. తిలకుభగవానులు ఏనాడు స్వదేశీ-జాతీయవిద్యాభావముల విద్యార్థిబృందమున వెదజల్లెనో నాటినుండియు విద్యార్థిలోకము జాతీయభావోపేతమైనవి. గాంధీ వీరిని శాసనధిక్కారమున కుపయోగింప ప్రారంభింపగనే వీరు ప్రభుత్వమువారి ప్రత్యేకదృష్టికి గురియైరి. మిగత విశ్వవిద్యాలయములందు - విద్యార్థులకు సేవ క్లిష్టము. కాని ప్రభుత్వాగ్రహమునకు లెఖచేయక మాళవ్యా వారి కతిస్వేచ్ఛ నొసంగెను. శ్రీరాధాకృష్ణన్ పండితుడు విద్యార్థులను మరికొంత అదుపాజ్ఞల కట్టుదిట్టము చేయుచును వారి

స్వేచ్ఛాస్వాతంత్ర్యముల నరికట్టుట లేదనియే వాదము. శ్రీమాళవ్యాపండితుడు విశ్వవిద్యాలయావరణమునందే నివసించుచున్నారు. ప్రతి ఆదివారమున కాబోలు శ్రీరాధాకృష్ణగారు కాశీలోనున్నచో - గీతాపాఠములు చెప్పుచుండిరట. శ్రీమాళవ్యాపండితుడు వృద్ధులయ్యు స్వయముగా సంస్కృతపండితులు, వేదాంతులునయ్యు ఆ ప్రపంచవిఖ్యాత వేదాంతోపదేశకుని వాగమృతమున గీతాసారము చవిచూడ ఆసక్తావేశములకువచ్చి వింటురట. శ్రీ రాధాకృష్ణగారికి మాళవ్యాగారియెడ్ల కడు భక్తి తాత్పర్యములు గలవు. శ్రీపండితునకు కొక్కకోరిక గలదు. విశ్వవిద్యాలయము లక్ష్మీనారాయణదేవాలయమును కట్టించవలయుననిరి. అదియింకను నెరవేరలేదు. శ్రీరాధాకృష్ణగారికి శ్రీవారి (మాళవ్యా) జీవితకాలమునందే ఆపని పూర్తిగావించి వారికి ఆత్మసంతుష్టికల్గించవలయును అని అభిలాష. అందుకై విశ్వవిద్యాలయముకొరకే గాక, ఈ దేవాలయము కొరకై కూడ ధనార్జన మొనర్చుచున్నారు.

## హిందూమహాసభా నాయకత్వము

జాతీయవాదముపేరట కాంగ్రెసు ప్రత్యేకతా భావముగల ముసల్మానులకు హిందువుల హక్కులు ధారవోయుననని మొట్టమొదట కనుగొన్నవారు

వారే అనవచ్చును. ముస్లింలీగువారట ముస్లిములు సన్నాహమై తమ కధికహక్కులకై పట్టుబట్టిపోరాడు చుండగా అధికసంఖ్యాకులగు హిందువులు ప్రత్యేకముగ సన్నాహముగావింప నవసరమని వీరు గ్రహించిరి. కాంగ్రెస్సుతిరిగిన గాంధేయులకును యెందున వేసిపోక యున్నారే యని యొన్నుపగిన వీరికి ఇట్టివారేయగు శ్రీస్వామీ శ్రద్ధానంద, లాజపతిరాయి, మూంజీ ప్రభృతులు తోడైరి. హిందూమహాసభ తొలుతటిరోజులలో కీ. శే. శ్రీమాన్ సత్యమూర్తి, గా. టంగుటూరి ప్రకాశంపంతులు మున్నగువారుపోయి ఆసభారంగమున నిల్చి ఉపన్యాసములిచ్చి యుండిరి. హిందూమహాసభకు బ్రహ్మయై పుట్టించి, పోషించు లయకాలరుద్రుడనందగిన శ్రీ వీర సావర్కరు కప్పగించెనన జెల్లును.

### సనాతనధర్మము

వీరు సనాతనధర్మపరులన జెల్లును. కాని వీరి సనాతనధర్మము-సంస్కరణము నపేక్షించునది. ముఖ్యముగా అస్పృశ్యతా నివారణమున వీరి కృషి అమోఘము. వీరొక్కతరి- కాలానుగుణ్యముగ నూతనస్మృతి వ్రాయవలయును అని సూచించిరి. ఇందు కొకకారణము గలదు. వీరు హిందువులు తమ ఆచారవ్యవహారములు, కులమతధర్మములు తమ

ధర్మసభలయందు సంస్కరించి తీర్మానించుకొనవల యునుగాని మతాంతరములతో గలిసి శాసనసభల తీర్మానింపజేయరాదు; విదేశీయులు, విజాతీయులగు ఆంగ్లేయుల సహాయముకై అర్రులుజాచరాదు అని వీరి అభిప్రాయము. కావుననే వీరు శాసనచట్టము మున్నగువాని నాక్షేపించిరి. అయితే స్వయముగా హరిజనులకు గంగాతీరమున "నారాయణమంత్ర" ముపదేశించి గంగాజలమును తీర్థమిచ్చి పునీతులు గావించిరి. సంపూర్ణ ప్రభుత్వ సంపత్తిగల హిందూ ప్రభువులే యున్నచో వీరు పురాణములలోవలె మొత్తములుగా నీహరిజనులను సన్యాసులుగా త్రివేణీ సంగమమున పూర్ప్రించియుండేవారే యని తలం తును.

—శ్రీవారి దేశభక్తి, ప్రజానురక్తి, సేవాసక్తి—

శ్రీవారి దేశభక్తి, ప్రజానురక్తి, సేవాసక్తి, విస్తారము. వారిజీవితమున వీనికొరకై యే ధారపోయ బడినదని చెప్పుచున్నారు. వీరికి తమచింతితార్థములు నెరవేరకుండానే గతింతుమేమో యని యొకచింత గలదు. 1937 సంవత్సరమున వీరికి 74 సంవత్సరములు ఇంకను 15 సంవత్సరములు జీవించినగాని తాము తలపెట్టినకార్యములు నెరవేరవని వారికి స్ఫురించెను. అప్పుడు పురాతనపు ఆయుర్వేదవిధానమైన కాయకల్పచికిత్సమున

ఆయుఃపరిమాణము వృద్ధియగునని తెలియవచ్చినంతనే వీరు రాకశిన చికిత్సను కఠినతరమగు కుటీరప్రవేశపద్ధతిని చేకొనిరి. దానివలన వీరి ఆరోగ్యమునకు పుష్టిగనైనా భంగముగనైనా యనునది వివాదాంశముగ నున్నది. (దీని వివరములు తెలియ వీరాకాలమున నిచ్చిన స్టేటుమెంటులు విధిగ ప్రచురించితిమి.

స్వరాజ్యప్రాప్తి కనులారగాంచవలెనను వీరి ఆత్రమును ఫెయిజ్‌పూరు కాంగ్రెసులో వీరిచ్చిన యీ క్రింది ఉపన్యాసము తెల్పును.

"ఏబదియేండ్లనుండి నేను దేశమునకు సేవచేసియున్నాను. ఇక నేను సెలవు తీసుకొనుసమయము రానున్నది. త్వరలో నే నీప్రపంచమునుండి నిష్క్రమింపక తప్పదు. నాదేశము దాస్యవిముక్తినొందుట చూడకమునుపే నేను మరణింపవలసివచ్చునేమోయని నాహృదయము వేదనపొందుచున్నది. నా దేశీయులకు నేజేయు ప్రార్థనమిది. ఈమన దేశమున త్వరలో స్వాతంత్ర్యభానూదయ మగునట్టుల మీయావచ్ఛక్తిని వినియోగించి పనిచేయవలెను. మావంటిముసలివారలకు అవసానసమయమున నిట్టి హృదయవేదన గలుగకుండ చూడవలసినభారము మీపైనగలదని గ్రహింపుడు."

వారికి రాజకీయములయం దెంత ఆసక్తియో, స్వరాజ్యప్రాప్తియం దెంత ఆత్రమో, వారు నేఁడు కాబినెట్ మిషన్ రాయబారములను స్వయముగా నెరుంగుటకై ఢిల్లీ రాకయే తెలుపుచున్నది.




అరువదిసంవత్సరములుగా దేశసేవచేయుచున్న 200 సంవత్సరములుగా అధికారము చెలాయించిన విదేశీయఅధికారులు చేతులార వదలుకొని భారతీయుల కప్పగింతుమని దూరాభారమనక ఢిల్లీకివచ్చినారు. 85 సం॥ ముదుసలి అయ్యు పండితులు ఎట్లూరుకొనగలఁడు, ఢిల్లీ, గాంధీ ఎంతకావని నొక్కిచెప్పినను ఈవయోవృద్ధుఁడు ఢిల్లీ చేరినాఁడు. ప్రస్తుతము కేవలము అవశుఁడై శల్యాగతుఁడై వున్నాఁడు. అయిననేమి భంగీనివాసమున బసచేసి యున్నగాంధీని తానెవచ్చి చూడ తయారైనాఁడు గాంధీ ముందే దీని నూహించి తానెవచ్చి మాలవ్యాను సందర్శించెను. (18-4-46) గాంధీ తనప్రూహా నిజమని తెలిసినదే నేనువచ్చి మిమ్ముచూచే బదులు మీరెవచ్చి నన్ను చూచినయెడల నాకు తలవంపులయ్యేడిది అని నొచ్చుకున్నాఁడు. 85 సం॥ అయిన ఆయనబుద్ధి చురుకుగా పనిచేయుచున్నది. జ్ఞాపకశక్తి చెక్కుచెదరకయున్నది. చూపు బాగున్నది.

గాంభీర్యము చెడకయున్నది. ఒక్కదేహశక్తియె బలహీనముగా యున్నది. సంభాషణలయందు గుసగుసలాడినట్లుండును. నిత్యము ఆయనసన్నిధినుండ సేవించు ఆయనకుమారుడు గోవింద కాంత మాలవ్యా శ్రోతలకు సహాయభూతుడగుచున్నాడు. ఆయన నిలువెల్ల నిండి సముడీకృతమైయున్న ఒక్క గాని ఒక్క ఆవేదన భారతస్వాతంత్ర్యము, భారతదేశ అవిగత గాంధీ ఈ రెండువిషయముల గూర్చి ఆయన భయముబొందెను. గాంధీ మహంతులకు చెవియొగ్గకుడని మాలవ్యాపండితుడికి కొంత హితోపదేశముచేసెను. దానికి ప్రత్యుత్తరము "ఇది పూర్వము నేను విన్నదే" అన్నట్లుగా శిశువువలె చిరునవ్వు నవ్వి పండితుడు "నీవు సదా కార్య వాదివి" నీతో మాటలు పెంచరాదు అని హెచ్చరించెను.

రాయబారములు ఢిల్లీ వదుకుగాగ సిమ్లా జలువ నపేక్షించెను. ముఖ్యులందరు సిమ్లాకు బొక్కెసలుకట్టిరి. పండితుడును సిమ్లాకు ప్రయాణమగునేమొనని భయముచెంది గాంధీ ఆయన పునర్దర్శనముగావించెను. మాలవ్యా వారణాసికివెల్లుచున్నాననిచెప్పగా విని సంతోషించెను. అప్పుడు గాంధీ మాలవ్యావుత్సాహము గమనించెను. ఆయ

నను "ఇంకను మీ రెన్నాళ్ళు యిట్లు దేశీయ వ్యవహారములగూర్చి చీకాకుపడుచుందురు?" అందుకు అద్భుతనేత్రవిన్యాసముతో పండితు డిచ్చిన జవాబు "ఎంతకాలము దేశీయవ్యవహారములు చీకాకుకల్గించుచుండునో అంతవరకు" అంత నాపుణ్యపురుషులకు జరిగినసంభాషణక్రమ మిది.

గాంధి—:"అయితే నావంటి చిన్నవానికి ఏమి విడువరా. దానివల్ల నే నింకను చిన్నవాడనగుదునే"

మాలవ్యా:—"గాంధీని ప్రసన్నదృష్టి నరయుచు (ఈ యువకుడు చిరకాలము యిట్లే యువ్వనుడై యుండబోవుచున్నాడు.)"

గాం:—"రాము వహించిన భారములలో నేదైన నాభుజముల నుంచుడు" అయితే ఒకటి వదత్తు. మీరు ఇక దానినిగూర్చి చీకాకుపడరాదు. మీశక్తిలో లవలేశము నాకున్న సంప్రతింపవలెనని ఆశీర్వదింతును.

మాలవ్యా:—"భగవన్నామమె బలములకెల్ల బలము."

గాంధీ:—"నిజమె, నిరంతరము రామనామ స్మరణచేయుచుందును. అయితే మీవిశ్వాసము నాకెక్కడ నుండివచ్చును. నేను పొగడుటలేదు. మహా

భారతము, భగవద్గీతలు మీకు తెలిసినంతగా నాకు తెలియవు."

మాలవ్యా:—"సకలవిజ్ఞానసారము భగవన్నామము. అది నీకొరకు బంగారముగదా."

గాంధీ:—"నిజమే, అయిన నీవిద్యత్తు చూసినప్పుడు నానోరూరినది. కావున ఆరోగ్యవంతుడనై నీవిజ్ఞానమును వినియోగించవలెను."

మాలవ్యా:—"ఆరోగ్యవంతుడ నగుదువు."

(అప్పుడు రాధాకాంతమాలవ్యా ఇటీవల హరిజనపత్రికయందు ప్రచురింపబడిన వనస్పతీ నేతిని ఆక్షేపించెను. వ్యాసమును తనతండ్రికి చదివి వినిపించితిననియు ఆయన దానికి హర్షించెననియు ప్రస్తావన లేగా మాలవ్యా "ఒకవైపు శాకఘృతమున్ను, మరియొకవైపు గోవధయు విస్తారమగుచు జాతినుత్పాతమును కల్పించుచున్నవి. ఈరెంటిచే ప్రజల జవసత్వములు పీల్చివేయబడుచున్నవి. తీరసమృద్ధిలై నీవు కావించు ప్రయత్నము ప్రశంసార్హము"

గాంధీ:—"నే నీ ప్రయత్నము విడువను. అయితే పత్రకవాణిజ్యబృందము సహాయకారిగానిది నాపని కొనసాగదు ఇక శెలవు."

మాలవ్యా:—నమస్కారపూర్వకముగా గాంధీకి చిరునవ్వుతో శెలవొసంగి ఇట్లని ఆశీర్వదించెను.

"నిన్ను నేను మరువను. ఎచ్చటనున్నను రోజా పువ్వువలె నీసువాసన వెదజల్లను. ఇది మాలవ్యా ఆశీర్వదించుపద్ధతి (శుద్ధిక్రియుపంతములు "హరిజన" పత్రికయందు ప్యారిలాల్ వ్రాసినవానినుండి గ్రహింపబడినది. మాలవ్యా యోచనాపరంపరలు ఈవృద్ధాప్యమునను ఎట్లు ప్రసరించుచున్నవి తెలియగలందులకు ప్రధానవిషయములకు సంబంధించనివియు వ్రాసితిని.)

— సమాప్తి —

85 సం. వృద్ధుడయ్యు భారతదేశము స్వాతంత్ర్యమునుపొందుట చూడవలయునను ఆత్రముతో జీవించుచున్నాడు. ధర్మపత్ని గతించినది. పెద్దకొడుకు స్వర్గస్థుడైనాడు. కార్యరంగమున తనతోటివారలె కాక తనకన్న పిన్నవారలున్ను ఎందరో గతించినారు. కాని మాలవ్యాపండితుడు ఆ ఆశామాత్రము వీడక భీష్ముడు అంపశయపైనున్నట్లు శల్యాగతుడై జీవించుచున్నాడు. అవశ్యము భారతదేశము అవిభాగ్యమై స్వాతంత్ర్యము సంపాదించుట చూడగలడు. ధర్మరాజ్యసంస్థాపనను కనులారగాంధి స్వహరి

పాలనాధికారము సహింపుభారతసంతానమునకు ధర్మోపదేశము నొసర్పగలఁడు.

శ్రీమాళవ్యాపండితుఁడు తానుపొందిన కాయకల్పచికిత్సావిధానమును గూర్చి గావించినప్రకటన (హిందూపత్రిక) (1-5-38.)

కాయకల్పచికిత్సంగూర్చి మిక్కిలిగా ప్రసంగింపబడుచున్నది. నేను కుటీరమునుండి వెలికిరాగానే ఈచికిత్స బహుప్రచారమాయెనని వింటిని, దాని ఫలితములగూర్చి అతిశయోక్తులతో ఆశలుకల్పింపబడినవట. విదేశములనుంచికూడా ఈవిషయమై సంజాయిషీ కోరబడెననియు వింటిని. ఈచికిత్సను గూర్చి దీనిఫలితములనుగూర్చి తెలియవలెననే కుతూహలము హెచ్చుగానున్నదని తోచుచున్నది. ఆకోరికను ఈమూలకమున కొంతతీర్చెదను. ఇది అవసరముకూడ. దీనివలన ఈవిషయమై ఏర్పడిన గమనముమూలమున మంచి కలుగవచ్చును; పొరబాటుగా ఈచికిత్సనడసి ఎవ్వరును హానిచెందకుండాకూడ నిది యుపకరించును.

యౌవనప్రాప్తికిఆయుర్వేదమునందు కాయకల్పచికిత్స యని యొక పేర్పడియున్నది. ఆయుర్వేదశాస్త్రములలో చరకము పురాతనగ్రంథము; దానియందు అనేకాధ్యాయము లీవిషయమై వ్రాయబడి

యున్నవి. సుశ్రుతుడు, వాగ్భటుడు అనే ఆయు ర్వేదాచార్యులు దీనివిషయమై తమగ్రంథముల పొందుపరచియున్నారు. ఇందునుగూర్చి చెప్పబడిన ఔషధరాజములను 'రసాయనములు' అందురు. పైనచెప్పబడిన గ్రంథములందు అనేక సిద్ధౌషధములు పేర్కొనబడియున్నవి.

ప్రప్రథమమున గొప్పఋషులను పునర్యౌవన ప్రాప్తికై ఈరసాయనచికిత్స యేర్పడినది. ఈరసాయనచికిత్సనుగూర్చి చరకు డిట్లని చెప్పి యున్నాడు:—

"పురాతనకాలమందు వ్యాసుడున్నూ ఇంకా ఇతరగొప్పఋషులున్నూ, ముదిమిచే శుష్కించిన వారై తిరిగి తేజోబలసంపన్నులు గావలంచి ఈ రసాయనముల సేవించి దీర్ఘకాలము జీవించిరి. తద్వారా, వారు తీవ్రమైభాగ్యయుక్తులై, శమదమాదిసంపన్నులై బ్రహ్మచర్యవ్రతనిష్ఠాపటిష్ఠులై తపశ్శక్తిసంపాదించి దీర్ఘాయుష్యపరిపూర్ణ సామర్థ్యజ్ఞానము చూరగొని వీని నెంతోకాలము తృప్తిగా అను భవించి తుదకు మోక్షప్రాప్తినొందిరి. కావున ఎవ్వరు సుఖాసక్తులై దీర్ఘాయువుం గోరుదురో వారు నిర్ణీతమగువిధినిషేధముల ననుసరించి తగు జాగ్రత్తతో ఈరసాయనములను సేవింపదగును."

మరొక్కచో చరకు డిట్లు లిఖించెను:— "ఈ రసాయనములు సేవించుటచే పురుషుడు దీర్ఘాయువు, మంచిజ్ఞాపకశక్తి, విచక్షణజ్ఞానము, ఆరోగ్యము, యౌవనము, వర్చస్సు, గంభీరధ్వని, దేహా జ్ఞానేంద్రియములబలము, వాగ్ధాటి, శక్తి సామర్థ్యములు, వికాశము—అన్నియు చెందును."

ఎటువంటిపురుషులు రసాయనచికిత్సవలన ఉత్తమ ఫలితములపొందగలరు అనుదానిని గూర్చి చరకు డిట్లు వ్రాసియుండెను:—

సత్యసంధుడు, క్రోధరహితుడు, మాంసభోజనము విసర్జించినవాడు, బ్రహ్మచారి, అహింసాపరుడు, అతిశ్రమనొందనివాడు. జపపరాయణుడు, మధురభాషి, మనోదేహముల మాలిన్యములేనివాడు, శీలవంతుడు, ఓర్పుగలవాడు, నిత్యము దానమొనర్చువాడు, నియమనిబద్ధమైనజీవితము గడుపువాడు, దేవబ్రాహ్మణ, గుర్వాచార్యగోవుల నిత్యముసేవించువాడు, వృద్ధులమన్నించువాడు, అవమానకరమగుపనులుచేయ వెరచువాడు, దయార్ద్రహృదయుడు, జ్ఞానసంపన్నుడు, క్రమముతప్పక వేళకు నిద్రించి మేల్కాంచువాడు, పాలు వెన్న నిత్యము సేవించువాడు, కాలప్రభావమును అధికారప్రాముఖ్యమును కారణవిశేషమును ఎరింగిన

వాడు, అహంకారవిరహితుడు, పొగడదగినవిధము ననుసరించువాడు, దృఢమైనవిశ్వాసముగలవాడు, ఆధ్యాత్మకవేత్త, ఇంద్రియములజయించినవాడు, ఆయాగుణముల నన్నింటిని పరమాత్మ నెరుంగుటకుః యోగించువాడు, ఈశ్వరునియందు నమ్మకమున్న వాడు, అహంకారమును జయించినవాడు, ధర్మ శాస్త్రముల ననుసరించువాడు—ఇట్టి పురుషుడు రసాయనచికిత్సవలనిఫలితమును దాని నుపయో గింపకయే పొందుచున్నాడు. పైసద్గుణసంపన్నుడు రసాయనములను సేవించెనేని—ఏతచ్చికిత్సవల్ల నగు సంపూర్ణ ఫలమును పొందుచున్నాడు."

చరకుం డింక నిట్లు చెప్పియుండెను:—"దైహిక మానసికకల్మషములను, ఉభయములకు ఎవ్వండేని దూరమైనగాని, ఆతనికి రసాయనచికిత్స ఫలితంబు కలుగదు. కావున దైహికమానసిక కల్మషరహితులును, ఆత్మనిగ్రహముగలవారును మాత్రమే రసాయనముల సేవించుటవలన పూర్తిఫలితముల చెంద గలరు; అనగా, ఆరోగ్యసంపన్నులై, వ్యాధి, వార్ధక్యముల నశింపు చేసుకోగలరు.

మరియు నాత డిట్లు చెప్పియున్నాడు:—

"ఎవ్వరికైతే ఆత్మనిగ్రహము లేదో, ఎవ్వరికైతే తమమనసు తమ అధీనమందు లేదో, ఎవ్వరికైతే ఆరో

గ్యముయొక్క ప్రాముఖ్యము తెలియదో, ఎవ్వరి కైతే బ్రాహ్మణులయందు భక్తితాత్పర్యము లేదో వారు రసాయనచికిత్సవేదైన ఎత్తరాదు."

## చికిత్సాపద్ధతులు

రసాయనచికిత్స రెండుపద్ధతుల పొందవచ్చును. (1) కుటీరవాసవిధానము. (2) వాతాతపవిధానము. ఇందు మొదటిపద్ధతివలన రోగి కుటీర ప్రవేశమొసర్చి చికిత్సాకాలమంతయు అందే యుండపోవును. ఆ కుటీరము గ్రంథములందు పొందుపరుపబడినట్లుగా ప్రత్యేకముగా నిర్మింపబడవలయును. గాలి, వెల్తురు దుమ్ము, శబ్దము—మున్నగునవి లోన ప్రవేశింప రాకుండ ఆకుటీరము నిర్మింపబడును. ఈ రెండుపద్ధతులలో నిది యుత్తమమైనదనుట నిజమే. కాని సామాన్యులకు కఠినతరమగు ఆనియమములను పాటించుటమాత్రము కష్టతరము. కావున చరకు డిట్లు వ్రాసియున్నాడు:—

"సర్వసమృద్ధిసంపన్నులున్నూ, రోగరహితులు, విజ్ఞానులు, ఆత్మనిగ్రహముగలవారు, క్షమాస్వభావముగలవారు, అవసరమైనవన్నియు లభ్యపరచు కోగలవారు, ఈపద్ధతిలో చికిత్సబొందవలయును." ఇతరులకు వాతాతపవిధానమున రసాయనములు సేవించుట నిర్ణయించినాడు.

రాజులు, ప్రభుత్వాధికారులు, ప్రజలరక్షింపవలసినవారు, వారిని సేవించవలసినవారు, వారికి కుటీర ప్రవేశవిధానము స్పష్టముగా నిషేధింపబడినది. వారికి 'వాతాతపవిధానము' విధింపబడినది; అది వారి ప్రభుత్వాధికారనిర్వహణ కార్యక్రమమున కాటంకప్రదముకాదు.

ఏదియెట్లున్నను, రసాయనచికిత్స సమర్థుడగు వైద్యునియాజమాన్యమున జరుగవలయును. ఆ వైద్యుడు రోగిని తనశిశువుగా చూచుకోవలయును. రోగియు వైద్యుని మన్నించి ఆయనయెడకృతజ్ఞుడై యుండవలెను- అని చరకుడు నిర్ణయించెను. వ్యాధిగ్రస్తమై నవయుచున్న మానవలోకమును సేవించుటకై కరుణార్ద్రచిత్తుడై వైద్యుడా ఆయుర్వేదము నాశ్రయింపవలయును- అని చరకుడు స్పష్టముగా వచించియున్నాడు. కావున రసాయన చికిత్స నడుపువారు ఆశారహితులు, ధనాపేక్ష రహితులుగా నుండవలయును. "భుక్తికై ఆయుర్వేద వైద్యమవలంబించినవైద్యులు బంగారపు కుప్పలవిడిచి ధూళిరాసులు పోగుచేయువారగుదురు." అని చరకుడు చెప్పియేయున్నాడు.

రసాయనచికిత్సప్రాముఖ్యము విరివిగాను సరిగాను తెలియబడదగును, ఈచికిత్సను కొన్నిప్రత్యేక

వ్యాధులనివారణకై చేయవచ్చునుగాని ముఖ్యముగా నిది పునర్యౌవనప్రాప్తికి నిస్పృష్టము తెలియబడదగును. కుటీరవాసపద్ధతిని రసాయనచికిత్స పొందుటకు ప్రతివాడున్నూ తగడు. లభ్యమగుచో రసాయనచికిత్స పొందువాడు కాయకల్పచికిత్స స్వయముగా తెలిసి అనుభవించినవానిసహాయముండవలయును. అంతేగాక సమర్థుడైన వైద్యుని సలహాకూడ పుచ్చుకోవలయును. అసమర్థులు అనర్హులు అయినవారిసలహా సహాయము కాయకల్పచికిత్సకు పనికిరావు. ఈవిషయమును స్పష్టపరచుటకున్నూ పైనచెప్పబడిన విషయములను వెల్లడించితిని.

## వా. అంగీకారము

కొంతమంది అప్పుడప్పుడు ఈకాయకల్పచికిత్సం బొందియుండిరి. కుటీరవాసవిధానము కేవలము సాధువులు, తాపసులు మాత్రమే పొందుచుండిరట; ఏకొద్దిగృహస్థులోమాత్రమే గాని ఫలితమును పొందిరట. బాబావిష్ణుదాసుగారు ఉదాసీసాధువులు; వీరిని 'తపసిబాబా' యనికూడా అందురు. ఆయన మధురాజిల్లాలో కోట్బాననందు నివసించుచుండెను. ఆయన $2\frac{1}{3}$ సం॥ల క్రిందట స్వయముగా కుటీరచికిత్సావిధానము గైకొనినారు. యీతామండలి

మందలి సాకేతపురనివాసులగు శ్రీరాయి ఇంద్ర నారాయణగారు కావలసినఏర్పాట్లన్నియు గావించిరి. ఈప్రయత్నము చాలా ఫలప్రదమైనది. చికిత్సకు ముందు ప్రజలు తపసిబాబాను శుష్కించిన ముదుసలిగా గాంచియుండిరి. ఎంత జాగ్రత్తగా అంచనావేసినను 65 లేక 70 సం॥ లవారని ఆయనను చెప్పవలసియుండెను. 40 రోజులుండి కుటీరము నుండి వెలికివచ్చినపిదప వారు 40 సం॥ లకన్న హెచ్చువయస్కులు కాదనిపించిరి. మధురాపురి నుండి ఇద్దరుపెద్దమనుష్యులు గతమేనెలలోవచ్చి ఈచికిత్సావిషయమై నన్ను గాంచిరి; నేనున్ను ఈచికిత్సపొందదగునని వారుచెప్పిరి. ఈచికిత్సను స్వయముగాపొందినవారితో మాట్లాడనిదే నేనొక నిర్ణయమునకు రాజాలకుంటిని; అందుచే ఆసాధు వును నావద్దకు పిలుచుకొనిరమ్మంటిని. కొన్నిరోజులు తర్వాత లెహరీపూర్వాల్‌వాసియైన పండిత హార దత్తశాస్త్రిగారితో ఘాజీబాద్ వాసి శ్రీ ఆనంద స్వామి నావద్దకు వచ్చియుండెను. వారున్నూ నన్ని చికిత్సపొందుమనిరి. నే నేనిశ్చయమునకు రాక మున్ను యాథామండలమున కాయకల్పచికిత్సను స్వయముగాపొందిన ఆసాధువును చూడవలయును అని వారికిని చెప్పితిని. మరికొన్నిరోజులకు ఆనంద

స్వామి ఆసాధుబాబాగారిని వెంటబెట్టుకొని నావద్దకువచ్చిరి. బాబాజీగారు నిజముగా 35 మొదలు 40 సం॥ లోపు యువకుడుగా నాకు కన్పించెను. ఆయనవిషయమై నేను గమనించినదానిని బట్టియు ఆయనతోను ఇతరులతోను ఈచికిత్స విషయమై నేనుమాట్లాడినదానినిబట్టియు ఇద్ది ప్రఖ్యాతమగుపునర్యౌవనప్రాప్తి విశేషమనియు నాకున్నూ ఈచికిత్సపొందుట చెల్లునవియు నేను భావించితిని. నా ఆరోగ్యము సున్నితముగా నుండగా కల్గినప్రాయమగు నిట్టిచికిత్సను నేను పొందుట తగదనివాదించు నాయిష్టబంధువుల నిందు కొడబరచుటకు నాకు చాలకష్టమాయెను. అయితే నే నీచికిత్సపొందుటకు నిశ్చయపరచుకొంటిని. నాతోపాటు తామున్ను ఈచికిత్సను పొందుడని శ్రీపండితహరిదత్తశాస్త్రిగారికి బాబాగారు సలహా నొసంగిరి. వారును అందులకు సమ్మతించిరి.

ఈహేమంతఋతువున కొత్తకుటీరము నిర్మించుటకు కాలవ్యవధి లేకుండెను. అలహాబాదువాసి లేటు లాల్ రామచరణదాసు నాపూర్వస్నేహితుడు. ఆయన మనుమడు లాలామోహనదాసు. ఆయన శివకోటియందలి 'రామబాగ్' అను తనబంగాళాను యావత్తున్నూ మాపరముగా నుంచెను. అందలి

రెండుభవనముల వరాండాలకు గోడలు కట్టించి—చరకుడు చెప్పిన కుటీరమునకు చాలవరకు పోలు నట్లొనరించెను.

## చికిత్స

చికిత్స జనవరి 16 వ తేది ప్రారంభమై ఫిబ్రవరి 24 వ తేదిన అంతమైనది. పండితహారదత్తశాస్త్రియు నేనున్నూ మామాకుటీరములందుంటిమి. ఆ రెంటికి 50 అడుగులదూర ముండెను. పూర్తిగా 40 రోజు లున్నూ మేమందు గడిపితిమి. అది చాల కష్టతర మాయెను. ఆ 40 రోజులు మేము సూర్యుని చూడ లేదు; వరాండాలోనికైన బయటికి అడుగు పెట్ట లేదు. కాలక్షేపమునకై అప్పుడప్పుడు చదువుటకు వీలుండెను. కాని ఆవిధముగానైన ఎక్కువ శ్రమపడ రాదనిమాకు చెప్పిరి. నాగది ప్రక్కన వరాండా కొక వైపున పండితు డొకడు వేదమువల్లించుచు మధ్యాహ్నమువరకు కొన్నిగంటలసేపు రుద్రాభిషేక మొనర్చువాడు. నాగది నానుకొనే మరొకవైపున మరొకపండితుడు శ్రీమద్భాగవతకాలక్షేప మొన ర్చుచుండిరి. అప్పుడప్పు డెవరినైన మిత్రుని మాగదులలో చూచుట కనుమతింపబడితిమి; కాని దాదాపు ఆకాలమందంత మేము వంటరిగానే గడిపితిమి. స్నానము, దేహామర్దనము, పరిశ్రమ

అన్నియు కూడననిరి; క్షురకర్మయు నిషేధింపబడెను. చికిత్సాకాలమంతయు వేడినీరే మే ముపయోగింప వలసివచ్చెను. పగటిపూట చాలాకాలము రాత్రి యంతటా మేము చీకటిలోనే గడిపితిమి. ఎప్పుడైన అవసరమైనచో క్రొవ్వువత్తిగాని విద్యుద్దీపముగాని వాడుకొంటిమి. మా ఆహారము కర్రియావుపాలు మాత్రమే. నాకు పట్టినంత త్రాగేవారము. నేను ప్రతిరోజు $1\frac{1}{2}$-2 శేర్లు త్రాగేవాడను.

## ఔషధము

వాగ్భటుడు నిర్వచించినవిధిని మాకు ఔషధము తయారాయెను. అందు ముఖ్యమైనవస్తువు 'అమలకము' (ఉసిరిక) బాబాజీగారు మరినాల్గుచూర్ణముల నందు కల్పిరి. వానివలన మందుగుణము హెచ్చును. ఈ ఔషధములరహస్యమును ఆయన తనముఖ్యశిష్యులగుకృష్ణదాసుగారికిమాత్రమే చెప్పి యుండిరి. చికిత్స అయినపిదప ఆఔషధులపేర్లునాకు చెప్పి, అవసరమనితోచినప్పుడు వానిని ప్రచురించుటకు అనుమతించెను.ఆఓషధులను ముడిసరుకుగా నాకుచూపుటకు అంగీకరించెను. పలాశవృక్షముల అడవిలో 30 మైళ్లదూరాన వాగ్భటుడు నిర్ణయించినట్లుగా ఔషధమును తయారుచేసి ప్రతి రోజున్నూ ప్రొద్దున 8 గంటల లోపున తెచ్చియిచ్చే

వారు. ఒక్కొక్కమోతాదు 6 ఔన్సులు: 2 ఔన్సుల ఆమలకము, 2 ఔన్సులవెన్న, దాదాపు 2 ఔన్సులతేనె. అట్టిమోతాదులు ప్రతిరోజున్నూ ప్రొద్దున సాయంకాలము సేవించవలసియుండెను. మాకు ప్రోత్సాహకరముగానుండుటకై మే మా ఔషధము సేవించునపుడు బాబాజీగారు మావద్దనే యుండేవారు. చికిత్సాకాలమంతయు శ్రీ పండిత హారదత్తశాస్త్రిగారు మోతాదునంతయు పుచ్చుకొనేవారు. కొన్నిరోజులైనపిదప మోతాదు ఎక్కువ అని భావించి బాబాజీగారిని సగమునకు తగ్గించుమంటిని.

నా అనుభవము

మొదట మూడువారములున్నూ నాకుటీరమున సుఖముగా నుంటిని. పండితహారదత్తశాస్త్రి శ్రీయంత్రమును పూజచేయుచుండెను. అయనకు చాల ప్రార్థనలు శ్లోకములు కంఠతఃవచ్చును. అవి ఆయనకు తోడునీడై యుండెను. నాకును కొన్నివచ్చును; నాకు అభిమానపాత్రులైన గ్రంథకర్తలను వాని మూలమున స్మరించుచుంటిని. ఈకాలమున రాత్రింబవళ్లు ఎంతో నిద్రించితిని. తర్వాత రాత్రిళ్లు నాకుమామూలుగా పట్టేనిద్ర తగ్గిపోయెను. కాని ఆవార పగలుకూడ దీయుచుంటిని.

మరికొంతకాలముపిదప రాత్రిళ్లు నిద్ర క్రమక్రమముగా తగ్గిపోజొచ్చెను. కడకు కొన్నిరోజులైన తర్వాతరాత్రిళ్లునిద్రయే లేకుండాపోయినది;పగలు కొద్దినిద్రతో తృప్తుడనై యుండవలసివచ్చెను. పండిత హరదత్తశాస్త్రికిన్ని పదిరోజులు నిద్రే లేకుండాపోయెను. ఆరోజులలో ఒకనాడు ఆయనకు ధైర్యము సన్నగిల్లెను; అపాయము కలుగునని భయపడెను; కాని తిన్నగా తట్టుకున్నారు. అభివృద్ధికిరాగల బాలవైద్యుడు ఘనానంద్ శాస్త్రిగారిని చాలభక్తియుక్తుడై సేవించినాడు. అట్లె నాకుమారుడు ముకుందు నన్ను చూచెను. నానిద్రలేమి నాకు చాలకష్టతరమాయెను. దానివల్ల నాకు నీరసమేర్పడినది. ఔషధము చాలించినపిదపకూడా 10 రోజులవర కల్లెయుండెను. కాని నేను కుటీరము వదలి అటుఇటుతిరుగుటకు వీలుకలిగెను. కేవలము పాలతో సరిపుచ్చుకోవద్దని గట్టిపదార్థముకూడా పుచ్చుకోమని నాకు సలహాయిచ్చిరి. దానివలన నాజాడ్యము వదలి నిద్రవచ్చునని చెప్పిరి. కాని నాకు గట్టిపదార్థము తినడము అంటే అసహ్యతయేర్పడెను. పాట్నాలోఉండే పేరుపొందిన వైద్యుడు శ్రీపండిత వ్రజవిహారీచౌబి నాయందు ప్రేమాతిశయముగల స్నేహితుడు. నాకుమారులు

ఆయనతో నానిద్రలేమినిగూర్చి చెప్పిరి. ఆయన దయతో పాట్నానుండి నావద్దకువచ్చి నాకు నిద్ర పట్టునట్లు చేయుటకు నావద్ద మూడురోజులుండెను. ఆయనయు తపసిబాబాగారుచెప్పినట్లే గట్టిపదార్థము తినుమనెను. పండిత హరిదత్తశాస్త్రిగారి శిష్యుడు కవిరాజ్ కేదారనాథ్ గారు కలకత్తానుండి ఆయనను చూడవచ్చిరి. ఆయనయు నానిద్రలేమికాలమున నాకు చాల సహాయమొనర్చెను. నా స్నేహితులైన డాక్టర్లుకూడా నన్ను చూడవచ్చి గట్టిపదార్థముల తినుమనిరి. తపసి బాబా తిరిగివచ్చి అదే సలహా నొసంగెను. వారిసలహా ననుసరించుటకు ప్రయత్నించిరి; ఇటీవల నిద్ర బాగా పట్టుచున్నది.

### చికిత్సాఫలితము

నేనును నాస్నేహితుడు పండితహరదత్తశాస్త్రియుఉభయులమును ఈచికిత్సవలన స్పష్టముగా బాగుపడితిమి. నాకన్నను 14 సం॥ లు చిన్నవాడు పండితహరదత్తశాస్త్రి; ఆయన ఆరోగ్యము చాలవరకు బాగుపడినది. చికిత్సకుముందు వెనుకతీయబడిన ఆయన ఫోటోగ్రాఫులు చూచినచో ఈవిషయము బాగుగా తెలియగలదు. అట్లే చికిత్సకు పూర్వము పిదప గైకొనబడిన నా ఫోటోలన్ని

చూచినచో ఎంతమార్పునా ఆరోగ్యమున కలిగెనో తెల్లమగును. ఈ విభేదకారణము స్పష్టముగచా.

నేను 9 పౌ॥ లు తూకము హెచ్చితిని. నావంటి రంగు తేజస్సు హెచ్చెను. నాకంటిచూపున్ను బాగుపడినది. నాపూర్వకంఠస్వర మొకకొంత తిరిగి లభించెను; నాజ్ఞాపకశక్తియు పూర్వమువలెనే బలీయమైనది. నాశిరోజములున్నూ భేదము తెలియు నంతగా నల్లబడినది. నాచేతులవణకున్నూ చాల వరకు తగ్గినది. నేను నడ్డివిరిచి నడుచుచున్నాను. నిస్సహాయుడ ననే భావము అంకురించుచుండెను; అది అంతరించి దాని స్థానే ఆశాంకురములు విశ్వాస చ్ఛాయలు పొడచూపెను. ఒక క్రమములేని చాలీ చాలని నిద్ర లేమియు దానివలన తాత్కాలిక జాడ్యమును నాకు సంభవింపనిచో నాకు కలిగిన ఆరోగ్యాభివృద్ధి ఇంకను హెచ్చుగా నుండెడిది. ఈచికిత్సకు పూర్వము నేనెంతో తగ్గిపోతిని; నేనెంతో జాడ్య స్వభావుడనై క్రుంగియుంటిని; దానిని జ్ఞప్తికి తెచ్చుకొని, ఇప్పటి నాస్థితి పోల్చి చూచుకొన్నచో నాయీమార్పునకు ఎంతో కృతజ్ఞుడను.

ఈచికిత్సకు ముందు పంచకర్మలొనర్చి దేహము నిర్మలమొనర్చుకొని తర్వాత నేనే చికిత్సపొందు

టకు కావలసినబలము చేకూరువరకు సావకాశమిచ్చి యుండినచో నాకింకను ఎక్కువలాభము కలిగి యుండేది. నా అభిప్రాయంలో పంచకర్మలు ఆతర్వాత విశ్రాంతి—ఈచికిత్సవలనపూర్తిపొందుఅవకాశము నివ్వగలవు. కుటీరమునకు వెలుపలనే చికిత్సపొందు వాడు తనచింతలను వ్యాకులములను వదలివేయ వలయును; ఈచికిత్సపొందుకాలమున వట్టి చీకు చింతలేక నిర్మలమనస్కుడై యుండవలయును.

ఒకపురుషునియొక్క ఏవయఃపరిపక్వమున కాయ కల్పచికిత్సపొందదగునో, సమర్థుడగు వైద్యునిసల హాపై నిర్ణయింపబడవలయును; విలక్షణమైన సందర్భములలో స్వయముగా నీచికిత్సపొందిన అను భవపరులగు సాధువుసలహాకూడా పొందుట యవ సరము. ఒకానొకగ్రంథమున వాగ్భటుడు 40-70 సం॥ లమధ్యా నీచికిత్స గైకొనవలయును అని నుడివియున్నాను. అయితే ఒకనికిగల ఆరోగ్యము బలము అనేవానిపై నిది ఆధారపడియుండును అన్నాడు.

వాగ్భటునిరచనాను మరియొకవిషయమును గమ నార్హము. ఈరసాయముననే వాడినచో పాత పండ్లురాలి కొత్తపండ్లు రావలయును; పాతగోళ్లు ఊడి కొత్తగోళ్లు మొలవవలయును; వెంట్రుకలు

నల్లపడవలయును. అయితే తపసిబాబాజీగారు మాత్రము పాపము ముందే చెప్పినారు; పాతపండ్లు రాలి క్రొత్తవిరావు అన్నారు; పాతగోళ్లూడి క్రొత్తవి పుట్టవు అన్నారు. తలవెంట్రుకలుమాత్రము హెచ్చుగా నల్లపడును అన్నారు. నేను ఉన్నదాని కన్న 20 సం॥లు చిన్నవానిగా కన్పింతుననియు తలంతుననియు మాత్రము చెప్పినారు. నిజానికి నాతలవెంట్రుకలు నల్లనైనవి; నారూపమున్ను పైనచెప్పబడిన రెండుఫోటోగ్రాఫులపోల్చిచూడగా భేదించియున్నది.

## నిర్ణయము

గ్రంథముల నీవిషయమై రచింపబడిన దానినిన్ని, పునర్యౌవనప్రాప్తికై గావింపబడిన చికిత్సలవివరము నాదృష్టికివచ్చినదానినిన్ని గమనించి చూడగా చరకుడు, వాగ్భటుడు మున్నగువారునిర్ణయించిన ఔషధములసేవించుటవల్ల వారు చెప్పినఫలితములు కలుగగలవు అని నాకు దృఢవిశ్వాసము కలిగినది; అయితే పాతపళ్లూడి క్రొత్తపండ్లు వచ్చుననియు-- పాతగోళ్లు రాలి క్రొత్తగోళ్లు మొలుచుననియు, ఆయువు వేయేండ్లవరకు హెచ్చుననియు చెప్పబడినదిమాత్రము అక్షరములా తీసుకొనరాదు. దీర్ఘాయువు అనిమాత్రము తెలుసుకోవలయును.

అయితే కుటీరనివాసవిధానమునమాత్రము ఈ చికిత్స కష్టసాధ్యము; తగినజాగ్రత్త, మార్గదర్శకులు లేనిదే దీనికి గడంగుట ప్రమాదకరముగా నచ్చును. సాధువులలో కొందరు ఈచికిత్సను పొందినవారుగలరు; ఈవిషయమునుగూర్చి బాగుగా తెలుసుకున్నవారుకొందరు సలహా యివ్వదగియున్నారు. వారిసహాకారమునుపొందదగును; కాయ ల్పచికిత్సనుగూర్చి వారికిగల ప్రత్యేకజ్ఞానమును ప్రజలక్షేమమునకై వినియోగించుకోదగును. మొదటితరగతి లేక రెండవతరగతి కాయకల్ప కిత్స—పొందవలయు ననుకొన్నప్పుడు అట్టిది అను వము సామర్థ్యముగల ఆయుర్వేదవైద్యుని సలహా ంప్రతింపులతో చేయవలయును. చరకుడు చెప్పి ట్లు ప్రతివైద్యుడున్నూ, ఈచికిత్సగావింప సమ డుగాడు; ప్రతివాడున్నూ చికిత్సపొంద నర్హుడు ాడు. గొప్పఋషులు, ప్రజాసేవకులు, ఆధ్యాత్మిక ంతాపరాయణులు అగవారికొరకే ఈకాయకల్ప సాయనము లేర్పాటైనవి అని చరకుడు మున్నగు యుర్వేదగ్రంథకర్తలు పదేపదే వ్రాసియున్నారు. నుష్యను మానవసేవాపరాయణత్వదృష్టితో ాచింపదగునని చరకుడు ఆయుర్వేదవైద్యుల హ్నా యిచ్చియున్నాడు. ఈచికిత్సావిధానమున

ధనసేకరణకొరకై విని యోగింపరాదనుట నిస్సంశయము.

## ప్రస్తుత అవసరము

ఈ రసాయనచికిత్సవలన ఆరోగ్యయుతమగు పునర్యౌవనప్రాప్తి కలుగుననుట కాదనరాదు. మనవైద్యులలో చాలమంది, కుటీరవాసవిధానమునను వాతాతపసంధానమునను రసాయనచికిత్సగా పాటించియున్నారు. దానివలన చాలమంది బాగుపడియున్నారు. చరకుడును తదితరులను పురాతనవువారు. ఇటీవలన కొన్నిదశాబ్దములుగా నూతనపద్ధతులు ప్రాముఖ్యమునకువచ్చినవి. అమెరికాయందు పాలనుగూర్చి అద్భుతవిశేషములు బాహుళ్యముగా తెలిసినవి. డా॥ కెల్లాగ్ తన "న్యూడైయటిక్స్" అనే గ్రంథంలో పాలయొక్క ఆహారవిశేషములగూర్చి విస్తారముగా వ్రాసియున్నాడు. పురాతన అధునాతనవిధానముల రెండింటిని పూర్తిగా పరిశీలించి తెలిసికొనుట అవసరము; దానివలన ఈవిధానమును అత్యుత్తమపథమున వినియోగించుకొననగును; దానిని ప్రయోగించుటలో ఎట్టిపొరపాటైన జరుగకుండా చూచుకోవచ్చును. ఈచికిత్సకు సంబంధించిన అనేకవిషయములగూర్చి పరిశోధనపరిశీలన

అవసరము. కాయకల్పచికిత్స యందుభావముగల సాధువులును గొప్పవైద్యులును, కాన్ఫరెన్సుచేసి, రసాయనచికిత్సనుగూర్చిన ఈవిషయములు ఇతర విషయములు పరిశోధింపదగును. రాగల హేమంత ఋతువున ఇట్టి కాన్ఫరెన్సు కాశీవిశ్వవిద్యాలయమున జరుగుట మంచిదని నాఅభిప్రాయము. రసాయనౌషధముల పరిశోధనముగావించుటకు కాశీవిశ్వవిద్యాలయమును ప్రోత్సహింపదలంతును. ఆయుర్వేదవైద్యవిధానోత్కృష్టతయందు విశ్వాసముగల వారెల్లరు పైనపేర్కొనబడిన ఆశయములు నెరవేరుటకు తోడ్పడనగును.

పర్యవసానమున నేనున్నూ శ్రీపండితహరిదత్త శాస్త్రిగారున్నూ ఈచికిత్సనందుటకు శ్రీబాబావిభిషణదాసుగారున్ను వారిశిష్యులు కృష్ణదాసుగారున్నూ పరమోత్సాహముతో మాకు తోడ్పడినందులకు వారికి మాహృదయపూర్వకమైన అభివందనములు. నేను బాబాగారిని చూడకపోయి సన్న్యాసే నే నీచికిత్సపొంద నంగీకరించేవాడినా అనేది అనుమానాస్పదము. నాచికిత్సంగూర్చి ఇంతశ్రద్ధ శ్రమను గైకొన్న ఆనందస్వామికిన్ని నా అభినందనములు. ఈ ఔషధమును తయారుచేయుటకు తమపలాం

వృక్షవాటికను ప్రావశమునందుంచిన శ్రీబాబా రాజానాహెబ్ గారికిని నావందనములు—తుట్ట తుదకు తనరామబాగ్ భవనమునంతయు మా కప్ప జెప్పిన శ్రీలాలామనోమోహనదాసుగారికిన్ని నా కృతజ్ఞత. నే నీప్రకటన ఇదివరకే చేసియుండవలసి నది కాని నే నిది పూర్తిగావించునప్పటికి నామామూలు ఆరోగ్యము నాకు చేకూరలేదని కను గొంటిని. అందుచే నామామూలు కార్యక్రమముల చేపట్టలేదు. పదిరోజులు నాకు జ్వరముకూడా తగులుచుండెను. ప్రస్తుత మది నిలిచిపోయినది; త్వరలో పూర్తిబలము తిరిగి కలిగి మామూలు కార్యముఖమునకు తిరుగగలనని ఆశించెదను. దార్శనికులుగా నా ఆరోగ్యమునగలిగిన దిగు దల కాయకల్పచికిత్స సత్ఫలితముల కాపాదింప రాదు.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951.

# వచనగ్రంథములు

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర | ... | 1 | 4 |
| రఘువంశకథ | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, శ్రీ భా. రామమూర్తిశాస్త్రి | | 1 | 4 |
| ఈసపునీతికథలు, 1-వ భాగము | ... | 0 | 8 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 12 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| పంజాబు అల్లరి, శ్రీ మాలవ్యా జీవితము | ... | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 3 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్రము | | 0 | 12 |
| ద్వాదశోపనిషత్తులు, తెలుగువచనము | ... | 5 | 0 |
| గురజాడ అప్పారావుగారి చిన్నకథలు I సంపుటము | | 1 | 0 |
| డిటో గేయములు పాటలు II ,, | | 1 | 0 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 2 | 0 |
| నీతిరత్నాకరము | ... | 0 | 8 |
| వైద్యులకథలు | ... | 0 | 6 |

## జీ వి త ము లు

| | | | |
|---|---|---|---|
| శ్రీ లాలాలజపతిరాయిజీవితము | ... | 0 | 2 |
| శ్రీ గోపాలకృష్ణగోఖ్లేజీవితము | ... | 0 | 2 |
| శ్రీ మహాదేవగోవిందరానడేజీవితము | ... | 0 | 2 |
| శివాజీచరిత్ర, ప్రతిమతో | ... | 1 | 0 |
| గౌరాంగస్వామిచైతన్యజీవితము | ... | 0 | 4 |
| శ్రీ శంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 6 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | ... | 0 | 2 |
| శ్రీ కరంచంద్ గాంధిజీవితము, ప్రతిమతో | ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నెపోలియన్ చక్రవర్తిచరిత్రము, ప్రతిమతో | 0 | 4 |
| నెపోలియన్ బోనపార్టి జీవితచారిత్ర, రెండవభాగము ... | 1 | 4 |
| గాంధిమహాత్మునిచరిత్ర, ఉపన్యాసములు ... | 1 | 8 |
| శ్రీముడుంబ నరసింహాచార్యస్వామి జీవితము | 0 | 6 |
| స్వామిరామతీర్థ జీవితము ... | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్రము ... | 0 | 3 |
| శాలివాహనచరిత్ర ... | 0 | 3 |
| శ్రీతుకారామస్వామిచరిత్రము ... | 0 | 6 |
| సోదరినివేదితజీవితము, ప్రతిమతో ... | 0 | 2 |
| శ్రీ గైక్వారుగారిజీవితము ,, ... | 0 | 2 |
| శ్రీవివేకానందస్వామిజీవితము,, ... | 0 | 4 |
| లార్డ్ క్లైవ జీవితము ,, ... | 0 | 8 |
| శ్రీ వేమనయోగిజీవితము ,, ... | 0 | 4 |
| అనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో ... | 0 | 4 |
| శ్రీసమర్థరామదాసస్వామిచరిత్రము ... | 0 | 6 |
| అప్పయదీక్షితచరిత్ర ... | 0 | 12 |
| రామకృష్ణపరమహంసచరిత్రము ... | 0 | 4 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ... | 2 | 8 |
| గౌతమబుద్ధుని జీవితము ... | 0 | 6 |
| శ్రీచిత్తరంజనదాసుజీవితము ... | 0 | 4 |
| అలీసోదరులజీవితము ... | 0 | 4 |
| రాజగోపాలాచారిజీవితము ... | 0 | 4 |
| రామదాసుచరిత్ర, ప్రతిమతో ... | 1 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1